# నాట్యకళ



బహుధాన్య వసంతం - గ్రీష్మం - వర్షం
APRIL - SEPTEMBER 1998



సంపాదకుడు
తంగిరాల సుబ్బారావు

27



మహా సహస్రావధాని

డా॥ గరికిపాటి నరసింహారావు

కాకినాడ

# చైతన్య కవిత

సంపాదకుడు

**తంగిరాల సుబ్బారావు**

సహాయకులు

రాజేశ్వరీ దివాకర్ల

అంబికా అనంత్

వాసు

# గుడ్ల గూబ

-వాసు

ఇది నా రాత్రిచర్య
పిడికెడు చీకట్ని చెట్టుకొమ్మ మీద చూస్తూ
పిడికెడు గుండెని పూర్తిగా వింటూ
దినదినం దివాంధం ముందు దీనంగా కూర్చొని...

గొలుసులుగా తిరుగుతూ దాని
అయస్కాంతపు నిట్టూర్పు వలయాలు
నన్ను కాస్త కాస్తగా లాగేసు కుంటాయి
నేనలా గుడ్లప్పగించి దాని చీకటి గోళాల
నిశ్చలగతిలో అపస్మారకంగా ప్రయాణిస్తూ
నా నిండా భయంతో
కేవలం భయంతో
నా సొంత అస్థి పంజరం
చర్మం పైకొచ్చి పరుచుకున్నంత
లోహ కాఠిన్య భయంతో-
అదే నిశ్చల గతిలో దాని
అయస్కాంతపు నిట్టూర్పు వలయాల్లోకి జారు తూ....

ఈ రాత్రి ఇలాగే కాబోలు!
ఏ రాత్రైనా ఇంతే కాబోలు!
అయిన ఇదేం పక్షో!
ఇది కరవదూ తరమదూ
ఏ మెడుసా (Medusa) ఆకర్షణ తోనో
ఏ ఆదిమ శత్రుత్వపు జన్యుకణ జ్ఞాపకాల్తోనో
నన్ను ప్రతిరాత్రీ పలకరిస్తుంది.

ఇలా భయపడీ భయపడీ
భయమంటే మొహం మొత్తేసింది.
ఇకిలా లాభం లేదు.
నా స్వప్నావర్త రహస్సరోవరంలోకి
ఎవర్నీ రాళ్ళెయ్యనివ్వకూడదు.
రేపు ఉదయాన్నే వర్షం వెలిశాక చూడాలి
చెట్టు కింద తుఫాను దెబ్బకి చచ్చి పడున్న గూబని
దాని పీక మీద కాలేసి తొక్కే_సొచ్చెయ్యాలి.

ఇహ ఘూకాలొద్దు
ఏ కాకాల్నో శోకాల్నో కావాలనుకోవాలి
వాటి వల్లైనా ప్రతిఫలం ముట్టక పోతుందా!
ఆనక భయం లోంచి నిద్ర లోకీ
నిద్రలోంచి నిర్నిద్ర లోకీ...

# NATIONAL CODE OF CONDUCT

## FOR THE CITIZENS OF INDIA

1. Your country is your highest and first consideration in your life. Welfare of the country is your ownWelfare. Therefore, always be willingly ready to offer up even your life itself, for INDIA--- your country.
2. **DUTY :** Your first and foremost duty is to God and His Righteousness. Leading a righteous life will constitute the most valuable service to your Nation.
3. **Character :** Character is the greatest wealth. Pure, incorruptible character of the citizens is the greatest asset of your Nation-India. This is indispensable.
4. **Health :** Health is the basis of success in life. Health is wealth. Next to character, it is the greatest National asset and treasure. Building up character and protecting and safeguarding health, is your primary important duty, as a citizen to the Nation.
5. Eradicate the evils of liquor drinking, drug-taking, tobacco -smoking, chewing betels and gambling. Eradicate the evils of bribery, corruption, selfishness, immorality, dishonesty, and misconduct. Disloyalty to your Nation is the highest crime and greatest sin.
6. **O Citizen** you are the custodian of all public property. Do not spoil, misuse, steal or destroy National property. Preserve it with care.
7. All citizens of your country are your brethren. Fell this fellowship. Love all co-citizens and be united.
8. Have equal reverence for all religions and faiths. Love the followers of all religions as your spiritual brothers.
9. Avoid violence in any manner and avoid hatred of any kind. For this is a blot on the fair name of the Nation.
10. Adopt simple living and high thinking. Do not be extravagant. Avoid all waste. Practise frugality.
11. Uphold social justice and respect the rule of law.
12. Share what you have with your less fortunate fellow citizens. Inculcate love for your country, the spirit of patriotism and service, in your children and members of your family.

    Thus shine as a true citizen and serve your country best, by the very manner of your life and conduct.

# చైతన్య కవిత

## 27

బహుధాన్య సంవత్సరం

వసంతం - గ్రీష్మం - వర్షం

APRIL - SEPTEMBER 1998

సంపాదకుడు

**తంగిరాల సుబ్బారావు**

సహాయకులు

**రాజేశ్వరీ దివాకర్ల**

**అంబికా అనంత్**

**వాసు**

**చైతన్య కవితా వేదిక**

40/12-7 ''సౌరభ''(మేడపైన)

22వ క్రాసు, గోవిందరాజనగర

విజయనగర, బెంగుళూరు - **560 040**

CHAITANYA KAVITA, a journal devoted to Telugu Poetry and Published by Chaitanya Kavita Vedika, 40/12-7 "Saurabha" (Upstairs), 22nd Cross, Govindaraja Nagar, Vijayanagar, BANGALORE - 560 040, APRIL 1998.
Pp. xxvi+134

| | | | | |
|---|---|---|---|---|
| ముఖచిత్రం | : | ప్రముఖ దిగంబర కవి శ్రీ జ్వాలాముఖి, హైదరాబాదు | | |
| అట్ట వెనుక | : | ప్రముఖ దిగంబర కవి శ్రీ నిఖిలేశ్వర్, హైదరాబాదు | | |
| అక్షరాలంకరణ | : | పి.సి. నరసింహారెడ్డి - బాపు | | |
| వెల | : | విడిప్రతి | : రూ. | 20.00 |
| | | ప్రత్యేక సభ్యత్వం | : రూ. | 200.00 |
| | | జీవిత సభ్యత్వం | : రూ. | 500.00 |
| | | పోషక సభ్యత్వం | : రూ. | 1000.00 |
| ప్రకటనలు | : | నాల్గవ కవరు | : రూ. | 5000.00 |
| | | రెండవ కవరు | : రూ. | 3000.00 |
| | | మూడవకవరు | : రూ. | 2000.00 |
| | | పూర్తిపుట | : రూ. | 1000.00 |

**For Copies** : **Prof. T.V. Subba Rao** (Retd.)
No. 40/12-7,"Saurabha" (Upstairs)
22nd Cross, Govindarajanagar,
Vijayanagar, Bangalore - 560 040

**M/s. Visalaandhra Book House**
4-1-435, Bank Street, Hyderabad - 500 001
and all its Branches

**M/s. Navodaya Book House,**
Opp. Arya Samaj Mandir, Kachiguda,
Hyderabad - 520 027

**M/s. Pallavi Publications**
Eluru Road, Vijayawada - 520 002

**DTP & Printed By :** **Sree Laxmi Art Printers**
Vijayanagar, Bangalore - 40 Ph: 3300093

# అంకితం

**1986** నుండి ఈ నాటి వరకూ

ఈ 'చైతన్య కవిత'

ఇలా అవిచ్ఛిన్నంగా

అత్యంత సుందరంగా

వెలువడటానికి

ముఖ్యకారకుడు,

'దాన కర్ణుడు' శ్రీ డి. కె. ఆదికేశవులుగారిని

నాకు పరిచయం చేసిన మహానుభావుడు,

సరసుడు

సహృదయుడు

సాహిత్య రసికుడు

మధుర స్నిగ్ధుడు

మహోన్నత నాగరకుడు

నా ప్రాణాధిక మిత్రుడు

అయిన

శ్రీ బుల్లా సుబ్బారావు (ఐ. ఎ. ఎస్.) గారికి

ఆయురారోగ్య సంపత్పరంపరాభివృద్ధిని కాంక్షిస్తూ

నమస్సుమనస్సులతో

– తంగిరాల సుబ్బారావు

అల్లా, యెహోవ, రాములు
ఎల్ల శుభంబుల నొసంగి ఎప్పుడు బ్రోవన్
'బుల్లా సుబ్బారాయా!'
చల్లగ వర్ధిల్లు మయ్య సరస విధేయా!

కళలో - కావ్యజగత్తులో - కదలు సంస్కారంబులో - 'నీడ'గా
వెలయున్ 'రుక్మిణి' లక్ష్మి రూపమున, దివ్వెల్ బిడ్డలై వెల్గు కాం
తులలో మీరు శతాయు రభ్యుదయ సంతోషాల వర్ధిల్లుడీ!
లలితంబైనది మీ మనోంబుజము 'బుల్లా సుబ్బరాయాగ్రణీ'!!

-టి. వి. కె. సోమయాజులు




శ్రీమతి రుక్మిణి శ్రీ బుల్లా సుబ్బారావు దంపతులు

బెంగుళూరు

# 'మంగళగిరి' శిఖరం

- తంగిరాల

**1**

నేను
కీర్తి వెన్నెలలు కురిపిస్తున్న
చంద్రుణ్ణి కాను,
కోట్లకు పడగలెత్తిన
పారిశ్రామికవేత్తను కాను,
రంగులు మార్చే ఊసరవెల్లి
రాజకీయ నాయకుణ్ణి అసలే కాను;
నేను అమాయకుణ్ణి
అతి సామాన్యుణ్ణి
అయినా మాన్యుణ్ణి
గోతులు త్రవ్వడం రాదు
కుట్రలు పన్నడం లేదు
నాకు
నల్లని వన్నీ నీళ్ళు
తెల్లని వన్నీ పాలు !
ఎప్పుడూ మీతో నాకు
ఏదో ఒక పని పడుతుంది
మీరు నాకు కామధేనువు !
మీకు మాత్రం

నాతో ఏపనీ ఉండదు
నేను మీకు వట్టి గొడ్డుటావు !
అయినాసరే-
నాతో మీకు స్నేహం
ఒకటా రెండా?
ఇరవైయేళ్ళనుండి-
అవిచ్ఛినంగా
అతిస్వచ్ఛంగా
గంగోత్రి పవిత్ర ఝరిలా,
శరత్కాల ప్రసన్న కృష్ణవేణీ తరంగిణిలా,
కార్తీక మాసంలో
తెలతెల వారుతూంటే
కృష్ణా గోదావరుల అలలపై
తేలియాడే అరటి దొన్నెల్లో
చలిగాలికి గజగజ వణికే
ఆవు నేతి దీపకళికల్లా,
ఉదయకాల పక్షుల కలకలారావంలా
రహస్యంగా ప్రవహించే
కాలం మాయాజాలంలా,
పచ్చని వరిచేల మేనులు
సుతారంగా నిమురుతూ వీచే
స్వచ్ఛమైన పైరగాలిలా,
'బుల్లా సుబ్బారాయా!'
చల్లని మీ స్నేహం!!

## 2

నిత్య నైమిత్తికాలతో నేను
మునిగానాం తేలానాం అయితే
నెలల తరబడి మిమ్మల్ని చూడక పోతే
ఏడు కొండల వెంకన్నలా
ఏకంగా నా కలలోనే దర్శనమిస్తారు !
ఎక్కడున్నా సరే
రెక్కలు కట్టుకొని వచ్చి
మీ సమక్షంలో వాలుతాను
మీ తెల్లని చిరునవ్వుల పువ్వుల్ని
శరణు వేడుతాను !

## 3

నా మాటను మన్నించారు
తెలుగు శాఖకు మీ ఔదార్యాన్ని పంచారు
బెంగుళూరు విశ్వవిద్యాలయంలో
జాషువా సాహిత్యనికేతనం
రెపరెపలాడించారు !
కోటపున్నయ్యగారి కీర్తిని
కోటి రెట్లు పెంచారు !!

## 4

'చైతన్యకవితా' భారం మోయ లేక
నేను క్రుంగి పోతూ ఉంటే-
చేయుతనిచ్చి లేవనెత్తారు
నా నిరుత్సాహ బాష్పకణాల్ని
మీ ప్రోత్సాహపు జేబురుమాలుతో ఒత్తారు
శంఖ చక్ర గదా ఖడ్గాలతో సహా
సిరి చెలువుడైన
ఆ 'ఆదికేశవ' మూర్తినే
నా యెట్ట యెదుటకు రప్పించారు
అభయ హస్త మిప్పించారు
మనసులోని శిశిరాన్ని తప్పించారు
నా పై నిరంతర వసంతాన్ని గుప్పించారు !

## 5

పేరుపెట్టి మిమ్మల్ని పిలిస్తే
నన్ను నేను పిలుచుకున్నట్టు
నా లోకి నేను చూచుకున్నట్టు
నా ఆత్మతో నేను సంభాషించినట్టు
ఇంటి పేరు తప్పిస్తే
ఇద్దరం ఒకటే కదా మరి!
అయినా
అందులోనూ ఉంది

అవినాభావ సంబంధం-
మా 'తంగిరాల' మీ గుంటూరులోనే ఉంది
నేడు గోదావరీ తీరంలో ఉన్నా
ఆరు తరాల ముందు
మాదీ మీ జిల్లానే !

## 6

ఈ నాడు
కృష్ణా 'టు' కావేరీ మీరయితే
గోదావరీ 'టు' కావేరీ నేను !
ఈ దక్షిణ జీవనదీత్రయం లాగే
మీ చిక్కని చెలిమి
అవిచ్ఛిన్నం
అతిస్వచ్ఛం
నిత్య నూతనం
ప్రియ మిత్రమా!
మీ మైత్రి
అత్యున్నతం
అది మధురం
అతి పవిత్రం!
('సామెతల ఆమెతలు లేని
ఇదేమి కవితయ్యా?'
అంటున్నారా సార్!
అయితే చూడండి నా తఢాఖా-)

బుల్లా సుబ్బారాయా!
చల్లని మీ స్నేహం-
'మంగళగిరి' గోపురమంత ఉన్నతం!
'పానకాలస్వామి' నిత్య నైవేద్యమంత మధురం!
'మా' వసిష్ఠుడు వరించిన
'మీ' అరుంధతి అంత
పవిత్రం!!

7

నా ప్రాణాధిక మిత్రమా!
ఒక వేళ నేను
ముదిమిని మదితప్పి
'జ్ఞానభారతి' ని మరచిపోవచ్చు
'లాల్ బాగ్' పూలతోటను మరచిపోవచ్చు
ఎ. సి. నగరం ఈ 'బెంగుళూరు' నే మరచిపోవచ్చు
కాని-
నిరంతరం 'విధానసౌధ' లో
ఫైళ్ళ కీకార్యణంలో చిక్కుకు పోయినా సరే-
నిత్యం నా రాకకోసం ఎదురు తెన్నులు చూచే
కల్హార ద్వయం లాంటి మీ కళ్ళను మాత్రం
ఈ జన్మలో మరచిపోలేను!!

**(ఇది ఏడు ఖండికల కవిత - 'సఖ్యం సాప్త పదీనం'-**
**రాబోయే ఏడు జన్మల వరకూ మీరే నా మిత్రులు!)**

# వసంత కోకిలలు

## వచన కవిత

### అనువాద కవిత



### నికషోపలం



### ఆంగ్లకవిత

## సంపాదకీయం :

# " అసలు ఎవరు చదువుతారీ పత్రికని ? "

ఈ మధ్య మా స్వగ్రామం తణుకు వెళ్ళి వారం రోజులు ఉన్నాను. ఒక్క రోజు కూడా ఖాళీగా ఉండకుండా, కవి మిత్రుల్నీ దాతల్నీ కలిసి, 'చైతన్య కవిత' ను గురించి వారికి చెప్పి, ఇటీవలి సంచిక (Latest Issue) ను వారికి చూపించి, చందాదారులుగా చేరమని బ్రతిమిలాడాను. (ఏ ఊరు వెళ్ళినా ఇదే పని. ఈ 'భిక్షాటనం' చూచి మా ఆవిడ మాటిమాటికీ నా మీద చిర్రుబుర్రులాడుతూ ఉంటుంది. అయినా నేను పట్టు విడువని విక్రమార్కుడిని!). నా అవస్థ అంతా చూచి మా మరదలు (మా 'బుల్లి తమ్ముడు' కల్నల్ టి. కె. మూర్తి భార్య) చి. సౌ. శంకరి : " ఎందుకు బావగారూ! రిటైరయ్యాక కూడా ఇంత అవస్థ పడుతున్నారు ఈ పత్రిక కోసం? అసలు ఎవరు చదువుతారీ పత్రికని?" అని ప్రశ్నించింది. "అవును; నిజమే; అసలు ఎవరు చదువుతారీ పత్రికని?" అని నాలో నేను చాలా సార్లు ప్రశ్నించుకున్నాను.

ఈ మాయదారి టి.వి.లు వచ్చాక అసలే అంతంత మాత్రంగా ఉన్న చదువరుల సంఖ్య నశించిపోయింది. ఒక వేళ ఎవరైనా చదివితే కథలకోసం వార పత్రికలు చదువుతారు. లైబ్రరీల నుంచి నవల్సు తెచ్చుకొని చదువుతారు. బాడుగకు తెచ్చుకొని డిటెక్టివ్ నవలలు చదువుతారు. సెక్సు పుస్తకాలు ఇంకా ఎక్కువ చదువుతారు. కవిత్వ పత్రికను చదివే వాళ్ళెవరు? మిక్కిలి తక్కువ మంది ఉంటారని నాకు బాగా తెలుసు. (12 సంవత్సరాల నుండి 'చైతన్య కవిత 'ను ప్రకటిస్తూ ఉంటే చందాదారుల సంఖ్య 400 దాటలేదు. 1000 కాపీలు వేస్తున్నాను; 600 కాపీలు ఉపాదానంగా ఇచ్చివేస్తున్నాను).

కవిత్వం లలిత కళల్లో ప్రధానమైనది. సంగీతం అందరూ పాడలేరు. చిత్రాలు అందరూ గీయలేరు. నృత్యం అందరూ చేయలేరు. అలాగే కవిత్వం కూడా అందరూ చెప్పలేరు; అందరూ ఆస్వాదించలేరు. విద్వాన్‌లు, భాషా ప్రవీణలు, తెలుగు ఎం.ఏ.లు చదివిన వాళ్ళంతా కవులు కాలేరు; కవిత్వాన్ని ఆస్వాదించలేరు.

మన ప్రసిద్ధ కవులందరూ ఈ తెలుగు డిగ్రీలు తీసుకున్నవాళ్ళుకారు. లాయర్లు, డాక్టర్లు, ఇంజనీర్లు, ఇంకా ఇతర వృత్తులలో ఉన్నవాళ్ళు అద్భుతమైన కవిత్వం చెపుతారు. అసలు మనగొప్ప కవులందరూ ఇటువంటి వాళ్ళే. (శ్రీశ్రీ- జువాలజీ బి. ఏ.; శేషేంద్ర- బి.ఎ. బి.యల్.). లలిత కళ అయిన కవిత్వం అల్లడం కాని, కవిత్వాన్ని విని ఆనందించడం కాని ఒక విధమైన ఉత్తమ సంస్కారం. ఇది చాలా కొద్ది మందిలో మాత్రమే ఉంటుంది. ఈ నాగరక సంస్కారం పూర్వ జన్మసుకృతం వల్ల వస్తుందని నమ్మేవాళ్ళల్లో నేనొకణ్ణి. ఈ అపురూపమైన సంస్కారం ఉన్న వ్యక్తుల కోసం వెతుక్కుంటూ నేను ప్రయాణం చేస్తున్నాను. వీరి సంఖ్య అత్యంతాల్పమని తెలిసి తెలిసే ఈ అన్వేషణ కొనసాగిస్తున్నాను. ఆ అనర్ఘమణుల కోసం పరితపిస్తున్నాను.

మనది ఎంత గొప్ప ప్రజాస్వామ్యమైనా సంఖ్యా బలాన్ని బట్టి ఒక పని మంచిదనీ, మరొక పని చెడ్డదనీ నిర్ణయించలేం. మంచి పనులు చాలా కొద్ది మంది చేస్తారు. చెడ్డ పనులు ఎక్కువ మంది చేస్తారు. పొద్దున్నే లేచి వ్యాయామం చేయడం, కాఫీ, టీలు త్రాగకుండా, సిగరెట్లు కాల్చకుండా, మద్యం జోలికి పోకుండా, నియమ నిష్ఠలతో జీవితాన్ని గడపడం, సత్యాన్ని పాటించడం, ధర్మాన్ని అనుసరించడం - ఇత్యాదిగా ఉండేవారు మిక్కిలి తక్కువ మంది ఉంటారు. దీనికి వ్యతిరేకంగా ప్రవర్తించేవారు ఎక్కువ మంది ఉంటారు. అలాగే కవిత్వం లాంటి ఉత్తమ లలితకళని ఆస్వాదించే సహృదయుల్ని వ్రేళ్ళపైన లెక్కపెట్టవచ్చును. నూటికి ఒక్కరు ఉంటారని కూడా ఖచ్చితంగా చెప్పలేను. కాగా మల్లంపల్లి శరభయ్యగారు చెప్పినట్టు కవిత్వం అష్టమ వ్యసనం. ఈ వ్యసనం ఒక పిచ్చి. ఈ కొద్ది మంది 'పిచ్చివాళ్ళ'కోసం ఈ 'చైతన్య కవిత'.

''కవిత్వాన్ని ఎవరు చదువుతారు? కవులు మాత్రమే చదువుతారు'' అని ఆక్షేపిస్తూ ఉంటారు కొందరు. నిజమే, కాని కేవలం కవులు మాత్రమే కవిత్వం చదివినా మనం ధన్యులమే. అలాగా జరగడంలేదు. (కొందరు కవులు కేవలం తమ కవిత్వాన్ని మాత్రమే చదువుకొని మురిసిపోతూ ఉంటారు. ఇతరుల కవితల్ని కన్నెత్తి చూడరు). ఈ కవుల్లో మళ్ళీ రెండు రకాలు : పద్య కవులు, వచనకవులు. పద్యకవులలో ఎక్కువ మంది పద్య కవిత్వమే చదువుతారు. కొందరు ఉదార

స్వభావులు పద్యాలతో పాటు వచన కవితలు కూడా చదువుతారు. వచన కవులు మాత్రం కేవలం వచన కవిత్వమే చదువుతారు. పద్య కవిత్వం చదవరు (చదవ లేరు) సరికదా, దానిని అకారణంగా ద్వేషిస్తారు. ఈ ద్వేషానికి ప్రధాన కారణం పాండిత్యం లేకపోవడం. ప్రాచీన సాహిత్యంతో ఏమీ పరిచయంలేక పోవడం, దురహంకారం, అజ్ఞానం కూడా మరి కొన్ని కారణాలు. పద్య కవుల్లో పాండిత్యం ఉన్నవాళ్ళు ఎక్కువ. అలాగే ఛాందసులూ ఎక్కువే! ఇక్కడ మనం ఒక విషయాన్ని ముచ్చటించుకోవాలి. శేషేంద్ర శర్మగారి 'ఆధునిక మహాభారతం', 'జనవంశం' అనే కావ్యాలను సమీక్షించబోతూ, ఈ క్రింది వాక్యాలతో తమ విశ్లేషణను ప్రారంభిచారు ప్రముఖ విమర్శకులు శ్రీ నడలి మందేశ్వరరావుగారు :-

'' మనకు సంప్రదాయాన్నెరిగి, ఆధునిక అంటే సచేల స్నానం చేసే పండితులూ, కవులూ ఉన్నారు. ఆధునికతను ఆలింగనం చేసుకొని సంప్రదాయమొక రోత అన్న ఫోబియా ఉన్న మేధావులూ, మేధావి కవులూ ఉన్నారు. సంప్రదాయాన్నెరిగినట్టు నటించే ఆధునికులూ, ఆధునికత సమాహన చేసికొన్నట్టు భావించే సంప్రదాయ నిష్ఠులూ ఉన్నారు. కాని, సంప్రదాయం రక్త నిష్ఠమై ఉంటూ, ఆధునికత ఆవశ్యకతను గుర్తించి, దానిని కవితకు ఆవహింపజేసిన కవులు చాల కొద్ది మంది ఉంటే, వారికి శేషేంద్ర శర్మ నాయక స్థానంలో ఉంటారు'' (విమర్శ : నాటి నుండి నేటివరకు)

ఈ మాటల్ని పద్య కవులూ వచనకవులూ ప్రతినిత్యం మననం చేసుకోవాలి. సంప్రదాయాన్ని ఆధునికతనూ సమన్వయం చేసుకొంటూ ముందుకుపోవాలి.

అత్యల్ప సంఖ్యలో ఉన్న కవులూ కవిత్వ రసికులూ సంఘటితమై కవితాస్వాదన అనే ఉత్తమ సంస్కారాన్ని ఆంధ్రదేశం నలుమూలలా వ్యాపింపజేస్తారని ఆశిస్తున్నాను. వారిప్రయత్నానికి మా 'చైతన్య కవిత' ఒక సమర్థమైన వాహికగా ఉంటుందని కూడా హామీ ఇస్తున్నాను.

'చైతన్య కవిత' చాలా బాగున్నదని కొంతమందీ, ఏమి బాగుండలేదని కొంత మందీ వ్రాస్తూ ఉంటారు. (మెదటి రకం ఎక్కువ, రెండవ రకం తక్కువ).

ఈ రెండు రకాల వాళ్ళూ అతివాదులే. మొదటి వర్గం వాళ్ళు అల్ప సంతోషులు; రెండవ వర్గం వాళ్ళు సినిక్స్ - కళ్ళకు గంతలు కట్టుకున్న వాళ్ళు. అందువల్ల వీళ్ళమాటలు నేను నమ్మడం లేదు. నాకు తోచిన రీతిలో నేను ముందుకు వెడుతున్నాను.

So-Called 'మహాకవు' లెవ్వరూ కవితలు వ్రాసి మా పత్రికకు పంపరు. అడిగి అడిగి విసుగెత్తి నేను ఇక ఆ 'మహాకవు'ల్ని అడగడం మానేశాను. వాళ్ళు ఎప్పుడో అమావాస్యకీ పున్నానికీ ఓ చిన్న కవిత వ్రాస్తారు; అది విప్లవ కవిత అంటారు. కాని దానిని 'బూర్జువా' పత్రికలకు పంపుతారు. (చైనాను, రష్యాను సమర్థిస్తూ తమ పిల్లల్ని అమెరికాకు పంపే మేధావుల్లాంటి వాళ్ళే ఈ కవులు కూడా). అసలు ఈ చైతన్య కవిత చేయి తిరిగిన కవులకు ఉద్దేశించింది కాదు. మా చైతన్య కవితా వేదిక ఉపాధ్యక్షులైన శ్రీ బుల్లా సుబ్బారావుగారు పదేపదే చెపుతూ ఉంటారు-చైతన్య కవిత క్రొత్తగా కవిత్వం వ్రాసే యువతీయువకుల్ని ప్రోత్సహించడంకోసం స్థాపించామని. ఈ విషయాన్ని చైతన్య కవిత బాగుండలేదనే వారికి జ్ఞాపకం చేస్తున్నాను. పోనీ చాలా గొప్ప కవిత్వాన్ని ప్రచురించే తెలుగు పత్రిక లేవి ఉన్నాయో ఈ 'మహానుభావులు' నా దృష్టికి తీసికొనివస్తే వాటిని చదివి ఆ మార్గంలో నడుస్తాను నేను.

ఇంగ్లీషులో కవిత్వపత్రికలు చాలా ఉన్నాయి. Standard విషయంలో ఒక్కటీ బాగుండ లేదు. వీళ్ళంతా కవులతోనూ అమెరికా డాలర్లతోను ఏదోవ్యాపారం చేస్తున్నట్టున్నారు. ఇప్పుడు మన దేశంలో ఉన్న మంచి సాహిత్య పత్రిక కేంద్ర సాహిత్య అకాడమీ వారు ప్రచురిస్తున్న "Indian Literature' (ద్వైమాసిక). ఇతర భారతీయ భాషలలో ఎలాంటి కవిత్వం వస్తోందో తెలుసుకుందుకు కవులూ కవితాప్రియులూ ఈ పత్రికను తప్పక చదవాలి. 'భారతి' ఆగిపోయాక తెలుగు వాళ్ళకు సరియైన సాహిత్య పత్రిక లేదు. తెలుగు అకాడమీ వారి 'తెలుగు', పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారి 'వాఙ్మయి' మొక్కుబడి పత్రికలు; తప్పనిసరి పత్రికలు. ఏదో గుడ్డిలో మెల్ల, ఫరవాలేదు. అయినా ఇవి పరిశోధనపైనే తమ దృష్టిని కేంద్రీకరిస్తాయి కాని సృజనాత్మక సాహిత్యాన్ని స్పృశించవు.

వ్యాపార పత్రికలు చిన్న చిన్న కవితల్ని తప్ప ప్రచురించవు. 10-12 పాదాలలోపు ఉంటేనే ప్రచురిస్తాయి. కవితకు ఒక నిర్దిష్ట స్వరూపం ఉంటుంది. మనిషికి తల, శరీరం, కాళ్ళు ఉన్నట్టుగానే కవితకు కూడా ప్రారంభం- మధ్యభాగం- ముగింపు ఉంటాయి. పది పంక్తులలోనే కవిత వ్రాయాలని శాసిస్తే, అందరూ అలా వ్రాయలేరు. నూరు పుటల పత్రికలో కవిత్వానికి రెండు పుటల్ని కూడా కేటాయించవు. కొందరు సుదీర్ఘమైన కవితలు వ్రాస్తారు. (ఈ సంచికలోని జ్వాలాముఖి గారి 'మదరిండియా-92' లాగ). వీటిని ఏ వ్యాపార పత్రిక ముద్రిస్తుంది? ఈ లోటులన్నీ తీర్చడంకోసం 'చైతన్య కవిత ' ఉద్భవించింది. కవిత్వాన్ని సీరియలైజ్ చేయడం కూడా చైతన్య కవితే ప్రారంభించింది.

'చైతన్య కవిత' కేవలం కవిత్వానికే అంకితమైన పత్రిక. ఇది అన్నిరకాల కవిత్వాన్నీ ప్రచురిస్తుంది. పద్య కవిత, గేయ కవిత, వచన కవిత, విప్లవ కవిత, శృంగార కవిత, స్త్రీవాద కవిత, దళిత కవిత - ఇత్యాది అన్ని కవితల్నీ సాదరంగా ఆహ్వానిస్తుంది. ఇలాంటి తెలుగు కవిత్వ పత్రిక ఆంధ్రదేశంలోకాని, ఇతరచోట్లకాని లేదు. ఇది ప్రముఖ కవుల ముఖచిత్రాలతో ప్రతి సంవత్సరం ఆరు మసాలకొక సారి అత్యంత సుందరంగా వెలువడుతుంది. మొదటి సంచిక వసంత ఋతువు (ఏప్రిల్‌నెల) లోనూ, రెండవ సంచిక శరదృతువు (అక్టోబరు నెల) లోనూ వెలుగు చూస్తాయి. కాబట్టి తమ కవితలు పంపవలసిందిగా కవులకూ, చందాదారులు కావలసిందిగా కవిత్వాభిమానులకూ, ప్రకటనలు ఇవ్వవలసిందిగా వ్యాపారవేత్తలకు మనవి చేస్తున్నాను.

'సౌరభ' —సంపాదకుడు

బెంగుళూరు

---

ఈ సారి కవులనుండి స్పందన బాగున్నది. ఏప్రిల్-సెప్టెంబరు 1997 చైతన్య కవితకు ముద్రణలో 300 పుటల కవితలు వచ్చాయి. వీటిని రెండు భాగాలుగా చేసికొని చైతన్యకవిత-25వ సంచికనూ 27వ సంచినూ రూపొందించాను. 26 వ సంచికను శేషేంద్ర సప్తతి సంచికగా చేశాను.

---

# 1995లో నోబెల్ బహుమతి పొందిన ఐరిష్ మహా కవి:

# సీమస్ హీనీ (Seamus Heaney)

– ప్రొ॥ సి. యన్. శ్రీనాథ్

ఐర్లాండ్‌లో తన మిత్రబృందంలో ''ఫేమస్ సీమస్''గా పేరు పొందిన ఆయన సున్నిత మనస్కులు, నిగర్వి, నిరాడంబరమైన కవి. ఈయన కవిత్వానికి మృదుత్వం, సున్నితమైన హాస్యం ఊతకర్రలు. శిల్పనిర్మాణం ఈయన కవితలోని గొప్ప బలం. ఎలాంటి వ్యతిరేకమైన, తీవ్ర భావాలు లేకుండా హీనీ లాంటి సమదృష్టి కలిగిన కవి అంత గొప్ప స్థాయికి చేరడం నోబెల్ బహుమతి అధికార సభకు గర్వకారణం.

ఆయనలో కవికుండాల్సిన లక్షణాలన్నీ ఉండి కూడా, ఆయన ముఖ్యమైన కవితా సంపుటాల్ని చదువుతుంటే మనకు ఒకరకమైన కొరత కనిపిస్తుంది. ఎంతో గొప్ప కవిత్వాన్ని చదవాలన్న కోరిక కాస్త భంగం అవుతుంది. ఐర్లాండ్ దేశపు ప్రకృతి సౌందర్యం, అక్కడి పురాణ కథలు ఈయన కవిత్వానికి ఒక విధమైన విశిష్టత నందించాయి. ఆస్టిన్ క్లార్క్, రిచర్డ్ కెల్ల్, థామస్ కిన్‌సెల్లా, జాన్ మాంటాగ్స్, రిచర్డ్ మర్ఫీ మరియు రిచెర్డ్ వెబర్, అనే ఆరుగురు ప్రసిద్ధ ఐరిష్ కవుల సంకలనపు ఉపోద్ఘాతంలో సంపాదకులు ''ఐరిష్ కవిత్వం ఇప్పటి వరకూ సహజ సంపదను గట్టి ఆధారం చేసుకుంది. ఇది చాలా సంతోషకరమైన విషయం. ఎందుచేతనంటే ఇంగ్లాండులో తమ స్వతసిద్ధత మీద, జాతీయత మీద అవగాహన ఉన్న కవులు చాలా తక్కువ'' అన్నారు. ఈ అవగాహన కవిత్వానికి, ఒక రకమైన విశిష్టతను చేకూర్చటానికి మూలశక్తి అయినా, దాని మీదే చిరకాలం కవి అభివృద్ధి చెందలేడు. హీనీకి వైవిధ్యత, ఐరిష్ జాతినుండి కాస్త వెలికి వెళ్ళి చూచే శక్తి, మరియు లోతైన ఆలోచనలున్నా, మనిషి కర్మవాదం గూర్చి ఆయన దృష్టికి ఇంకా పరిపక్వత రావాలి. ఇంకా యాభైఅయిదు సంవత్సరాలే ఉన్న అదేమంత కష్టంకాదు. ఆయనకు బహుమతి నివ్వడానికి నోబెల్ కమిటీ చాలా ఆత్రుత చూపినా, అది ఆయన అభివృద్ధికి ఆటంకం కాకుండా ఉండాలి.

ఇక ఆయన కవితా ప్రజ్ఞను గూర్చి చెప్పాలంటే హీనీ మొదటి కవితా సంపుటాలయిన ''డెత్ ఆఫ్ ఎ నాచురలిస్ట్'' మరియు ''డోర్ ఇన్‌టూద డాక్'' ఆయన పసితనాన్ని గూర్చి, ఆయన కష్టపడి ఆర్జించుకున్న యౌవనదశను గూర్చి ఒక ఆత్మవిశ్వాసపు గొంతుతో పలుకుతాయి. హీనీ వివరించినట్లు, ''డిగ్గింగ్'' అనే ఒక ముఖ్యమైన కవిత మొదట్లో ఒక కొత్త అనుభవంలా అనిపించినా, తరువాత ఆయన ఆత్మశోధనలో, ఆ కవితలో అర్థం పాక్షికంగానే ఉందనిపించిందాయనకు. దానితో పాటే వ్రాసిన ''ఫాలోవర్ & ఏన్‌సెస్ట్రల్ ఫోటోగ్రాఫ్'' అనే కవిత వంశం, వేర్లు, పెరుగుదలను గురించినది. ఆ కవితలో ఆయన తండ్రి, తాతల ఉనికి, ఐర్లాండ్ దేశపు ప్రకృతి దృశ్యం, మరియు కవియొక్క ''కలంతో తవ్వడం'' **(digging with the pen)** కనిపిస్తాయి. ఒక రోడ్డు బాగు చేస్తున్న కూలీ అన్న ఈ మాటలకు - ''కలాన్ని తేలిగ్గా ఉపయోగించవచ్చు. ఓ కుర్రాడా, అది పారకన్నా చాలా తేలికయినది. నేను చెపుతున్నాను'' - హీనీ చాలా విలువనిచ్చారు. ఆయన తొలి రచనల్లో బ్రిటిష్ కవులయిన హాప్‌కిన్స్ మరియు టెడ్ హ్యూజెస్ యొక్క ప్రేరణ కనపడుతుంది. 'పర్సనల్ పెలికన్' అనే కవిత యొక్క ముఖ్య ప్రతిమ ఐర్లండ్ దేశపు పురాణ కథలలోని 'బావి' గురించినది. ఆ దేశంలో దాదాపు మూడువేల బావులకు అక్కడి సిద్ధులతో సంబంధీయ చరిత్ర ఉంది.

మరొక్క ముఖ్యమైన కవిత ''ద వైఫ్స్ టేల్'' చాలా సున్నితంగా అక్కడి స్త్రీల స్థితిగతుల్ని, పురుషాధిక్య సమాజంలో వారి స్థానాన్ని గురించి చాలా సునిశితంగా వివరిస్తుంది. ఈ కవిత ''ద వైఫ్స్ టేల్'' ప్రపంచ వ్యాప్తంగా జరిగే విషయాన్ని గురించి చూపుతూ, చాలా జనాదరణ పొందింది. ఒక స్త్రీ తన భర్తకు మిగతావారికి భోజనం పొలానికి తీసుకు వెళితే, ఆమె భర్త ప్రవర్తన, మాటవరస వ్యవహారం ఆమె అక్కడి పనిపాటల్లో భాగం కాదని చూపుతాయి.

అలాంటి స్థలాచార విషయాన్ని కవి తన శక్తితో ఒక మంచి కవితగా సృష్టించగలగటం గొప్ప విషయం. అలంకారాల అల్లికలో పడెయ్యకుండా, కేవలం కవితాయుక్తితో తనలోని అంతరార్థాల్ని అందించగలగటం సామాన్య విషయం కాదు; ''ట్రెడిషన్స్'' అనే ఐరిష్ కవిత, హాస్యాన్ని, వ్యంగ్యాన్ని బాధాతప్త దేశభక్తిని అంతర్వాహిని చేసుకుని సాగుతుంది.

''అనుప్రాసల సంప్రదాయం
మా కంఠ్యమైన లోతు ఆలోచనల్ని
మాటల పొరపాట్లుగా ముద్రించితే
ఆచారం అనే అధికారపు ఆడది
మమ్మల్ని బ్రిటిష్ ద్వీపాల
పడకలోకి తోస్తుంది.
ఎలిజిబెత్ ఆంగ్లానికి మేము
గర్వపడాలి
ఉదాహరణకు 'వర్సిటీ' మాకు
గడ్డి పోచంత
మేము 'సపోస్' (Suppose) అనుకున్నప్పుడు
'డీమ్ (Deem) గానీ 'ఎలవ్' (Allow) గానీ అంటాము
మరికొన్ని జాగ్రత్తపెట్టిన ప్రాచ్యపదాలు
షేక్స్‌పియర్ భాషాలంకరాలు''.

1981-1991 మధ్యని పది సంవత్సరాలు, హీనీ యొక్క అతి సృజనాత్మకమైనవిగా చెప్పవచ్చును. మూడు కవితా సంపుటాల్ని - ''ది హా లాంటెర్న్'',''న్యూ సెలెక్టెడ్ పోయమ్స్ - 1966-1987'', ''సీయింగ్ థింగ్స్'' మరియు ''దగవర్నమెంట్ అండ్ ద టంగ్'' అనే విమర్శనాత్మక వ్యాస సంగ్రహం. ''ద క్యూర్ ఎట్ ట్రాయ్'' అనే నాటకం రచించడమే కాక ఆక్స్‌ఫోర్డ్ విశ్వవిద్యాలయంలో ''ప్రొఫెసర్ ఆఫ్ పొయిట్రీ''గా నియమింపబడ్డారు. కానీ ఈ విజయానికి వారి తల్లి మరణం, తరువాత కొద్దికాలానికే తండ్రి మరణం నీడల్లా చుట్టేసి ఆయనకు ఒక శూన్యాన్ని సృష్టించాయి. ఆ బాధలో నుండి కొన్ని ముఖ్యమైన కవితలు ఉద్భవించాయి. ''సీయింగ్ థింగ్స్'' అనే కవితా సంగ్రహం లో మనకి ఒక క్రొత్త దృష్టి కోణం కనపడుతుంది. పరిచయమున్న బాల్య జీవనపు పోకడే అయినా, ఆయన తల్లిదండ్రులను కోల్పోయి అనుభవిస్తున్న బాధను, చిన్నప్పటి ఆనందాన్ని ఒక భ్రాంతి దృశ్యంలా, దాన్నుండీ యౌవన దశలోకి పెరగటాన్ని సమన్వయించి, దానికి క్రొత్త రూపు నిచ్చి వ్రాశారు.

''నేను ఇంకొక పడవలో నుండి క్రిందకు చూస్తున్నట్టుగా ఉంది
గాలిలో తేలుతూ, పైన ఎక్కడో..
మేము ఎంత కష్టపడి తొలి సంధ్యలోకి పయనిస్తున్నామో చూస్తున్నాను.
వంచిన, ముద్రవేయబడ్డ మా తలల్ని ప్రేమించడం అనవసరం !''.

చివరగా, సీమస్ హీనీకి కాస్త న్యాయం చూపుతూ, ఆయన కవితా ఉత్కృష్టతను నిర్ణయించేటప్పుడు ఆయన కవితా సంపుటాలు కొన్ని, ముఖ్యంగా క్రొత్తగా వ్రాసినవన్నీ అందుబాటులో లేవనే విషయం గుర్తుంచుకోవాలి. కానీ కొందరు విమర్శకులు ఆయనకు 'నోబెల్' బహుమతి అందగానే ఐర్లాండ్ దేశపు 'అతి గొప్ప కవి' అని ప్రకటించడం కాస్త అసమంజసంగా అనిపిస్తుంది. ఆయన నోబెల్ బహుమతి, విషయం గురించి కాదుగానీ, ఆయనను 'ఈట్స్' వంటి మహాకవి గొప్పతనంతో పోల్చడం అంత సబబు కాదు. 'ఈట్స్' వ్రాసిన కవితలయిన 'బైజాన్‌టియమ్ పోయమ్స్', 'డయలాగ్ ఆఫ్ సెల్ఫ్ అండ్ సోల్', 'లెడా అండ్ ద స్వాన్', 'ప్రెయర్ ఫర్ మై డాటర్' లాంటి మరికొన్ని కవితలు చదివితే మనకు వాటిలో ఒక గొప్ప కవి ప్రత్యక్షమౌతాడు. ఒక మానవతా దృక్పథంతో మనిషి నరాల్లోని నెత్తురు, కల్మషపు రంగుల్ని ఎత్తి చూపుతూ, సజీవంగా సాగుతూ, ఆత్మకు శరీరానికి మధ్య సంఘర్షణలో దేన్నో వెతుకుతూ సాగుతాయి. (ఆయన కవిత ''ద ఫోర్ క్వార్టెట్స్'' లో **Old men ought to be explorers** '' అనే వాక్యం ఈ శతాబ్దంలో ఆయనకీ వర్తిస్తుంది, మరే ఇతర కవికి కాదు). అవి ఒక భావోద్వేగ పూరిత కవితలు; సున్నితత్వాన్ని, మనోస్థైర్యాన్ని కలగలిపి మానవ జీవితానికి లంగరు వేసుకుని, ఆకాశపు చుక్కల సంగీతంతో లయ కలిపినవి. ఈట్స్ కవిత్వం ఒక పావనత్వంలోకి సాగే మహాప్రయాణం. అదే ఆయన కలానికి ఉన్న గొప్ప బలం.

సీమస్ హీనీ మనసుకు అలాంటి పూర్వాక్రమణముందా అనే ఆలోచన వస్తుంది. అదుంటే మనిషి ఆలోచనను వెక్కిరిస్తుంది. మనిషి మొత్తాన్ని ఒక అల్లకల్లోలపు సముద్రాన్ని అర్థం చేసుకోవడంలో నిమగ్నపరుస్తుంది.

**(ఆకాశవాణి బెంగుళూరు కేంద్రం నుండి ప్రసారమైన ఆంగ్లప్రసంగవ్యాసానికి శ్రీమతి అంబికా అనంత్‌గారి అనువాదం - ఆకాశవాణి వారి సౌజన్యంతో - సంపాదకుడు)**

# తెలుగు పద్య ప్రశస్తి

-డా॥ గుండవరపు లక్ష్మీనారాయణ

ప్రక్కన చేరి సత్కవులపై కడుభక్తిని కూరి, నెత్తిపై
నెక్కి కళాప్రపంచము పయిన్ కడురక్తిని దంచి, ఎక్కడో
నక్కిన తెన్గుపద్య రచనా సతితో జత కల్పుచున్న - ఆ
వాక్కుల తల్లి అల్లరికి వాక్కుసుమమ్ముల కూర్తు వల్లరిన్. 1

కలము కరమ్మునన్ కలుగ కన్పడ కాగితమేదొ తెల్లగా
తెలియకయే చెలంగు గణదేవత చెంత, పరాకృతార్చనా
బలమొ? మరేమొ? నేనెరుగ, వ్రాసెద నేదొ కవిత్వమంచు - ఆ
పలుకుల తల్లి యేది యెటు వ్రాయగ చేసిన యట్టులే యికన్. 2

కలమున్ కాగితమున్ సమక్షమున కల్గన్ పద్యమున్ వ్రాయ నెం
దులకో కోరిక పుట్టు - వ్రాసి యిక ఏదో మాటలాడంగ మి
త్రులు రాగా పనిబూని వారిని వధింతున్ నా కవిత్వాల క
త్తులతో - ఐనను నిన్ను గోరుదురు మిత్రుల్ చిత్రమౌ పద్యమా. 3

నెలకొని పూర్వసత్కవుల నేమది కొల్చిన పుణ్యవాసనా
ఫలముగ తెన్గుపద్యకళపై అనురక్తి జనించె - దాని సే
వల ఫలితంబుగా నెదియొ వ్రాయుచునుందు - కవిత్వమంచు నే
పలుకను గాని - ఛందమున పద్యము వ్రాసితి నంచు పొంగెదన్. 4

అందము లెన్ని చందముల నందల మెక్కి చరించుగాక - నా
కెందులకో విచిత్రము వచించిన - ఒక్క తెలుంగు భాషయే
పొందిన సర్వలక్షణ సమూహ సముత్సవ రూపమైన ఆ
ఛందములో కవిత్వమయ శారద దర్శన మీయ తృప్తియౌ. 5

ఛందములో రచించినదె సార కవిత్వమటంచు పెద్ద వా
రెందును చెప్పలేదు నిజమే - గుణయుక్త సులక్షణాంగి యౌ
సుందరి ముందు పట్టి గుణసుందరి నిల్చునొకో! అదెంతగా
చిందులు త్రొక్కినన్ - కథలు చెప్పిన - కొల్చిన - కాళ్ళు పట్టినన్. 6

గొలుసులు కట్టి - గొంతుకను కుట్టి - పదమ్ములు లాగిపట్టి - ప
ల్కులకు నిఘంటువుల్ చదువు కొమ్మని చెప్పుచు పాడుచేసె ఈ
తెలుగుల తల్లినంచు పలుతీరుల పల్కెడు గొప్ప గొప్ప గొం
తుల యసమర్థతన్ దిగులుతోకను పూర్వ మహాకవీశ్వరుల్. 7

వ్రాసిన ఛందమున్ విడిచి పద్యము కాద? కవిత్వమన్న మా
టే సరిపోద దానికి? పఠించుట కూడ మహాపరాధమా?
నీ సరి నీవెయంచు నను నెట్టకుడయ్య! కవిత్వ మాలికా
వాసనలేని ఛందమది పల్కుల తల్లికి బంధమే యగున్. 8

కన్నడ మందు లేదు కనగాయతి - ప్రాసలు సంస్కృతమ్మునన్
మన్నన పొందలేదు యతిమాట వినంబడు కాని శ్రాంతియే
అన్నియు గల్గు తెల్గుల గళాభరణంబు! తెలుంగు పద్యమా!
పున్నె మదెంత చేసితిమొ! పుట్టితి విచ్చట తెల్గు గడ్డపై. 9

యతియును ప్రాసయున్ తమిళ మందున ముందెవసించెగాని సం
స్కృత గత వర్ణశక్తులు గ్రహింపగ లేక మితాక్షరాలతో
అతుకుల బొంతయై అరవమయ్యెను - తెన్గటుగాక మించి సం
స్కృతమును గూడ మ్రింగి ప్రసవించెను మేటి తెలుంగు పద్యమున్. 10

తెలివిగ పూర్వ సత్కవు లదే పనిగా యతులన్ గణంబులన్
మెలగు నినున్ వరించి భువి నిల్చిరి నేటికి - వేయియేండ్ల నీ

చెలిమి రుచిన్ నవీనులు హసించుచు సాగుచు నుండి రేడకో
తెలియని త్రోవలందు నవదృష్టి యటంచు తెలుంగు పద్యమా!

ఒక వేయేండ్లకు పూర్వ మేర్పడిన నీ యోగంబు హస్తాను హ
స్తికగా మా దరి నైకభోగములతో చేరంగ ఈనాడు తే
లికగా నెంచగ నీ నవీనులు సరేలే యంచుపేక్షించెదో?
ఏకసెక్కెంబులు క్రొత్తలాయనుచు నీ హేలన్ ప్రదర్శించెదో? 12

ప్రభువుల శాసనమ్ములను వర్తిల జేయుచు రాళ్ళకున్ వచో
విభవ మొసంగి - జానపద వేశ్మములన్ గళమెత్తి పాడుచున్ -
శుభ సమయమ్ము చూచుకొని సూరుల మానసముల్ గ్రహించి రాట్
సభలను చేరి పొందితివి శాశ్వత కీర్తి తెలుంగు పద్యమా! 13

నిన్నున్ కొల్చిన వారలే కద భువిన్ దేహంబదేనాడొ వి
చ్ఛిన్నంబైనను శాశ్వతంబగు యశస్సీమా విహార ప్రధా
నౌన్నత్యమ్ము గడించి నేటికిని దివ్యాంశ ప్రభావాత్ములై
యున్నారమ్మ తెలుంగు పద్యమ! మహాయోగుల్ వలెన్ చిత్రమౌ. 14

నన్నయ యన్న తిక్కన యనన్ జనుడెవ్వడెరుంగు? లోక మం
దున్న మరెవ్వనేని నెవ డూరును పేరు నెరుంగు? శ్రద్ధతో
నిన్ను సమాశ్రయింప కరుణించితి వంతియ కాక - లేక యే
మున్నది వారి గొప్ప తలయొగ్గి భజింప తెలుంగు పద్యమా! 15

పద్యము చచ్చిపోయెనని పల్కెడి వారొక ప్రక్క - వారికిన్
పాద్యము లిచ్చి అందలము పట్టెడి వారొక ప్రక్క గట్టిగా
వాద్యము లూదు చుండినను పద్య సరస్వతి నవ్వు కొదొకో
సేద్యము లేక యూరక సృజించునె ధారుణి ధాన్యరాశులన్. 16

# నేను

-డా॥ గరికిపాటి నరసింహారావు

మందార కుసుమాల విందారగించెడి
మధుకరమ్ముగ నేను మారవలయు
మేఘమండలమందు మెఱపు కారణమైన
నీటి చుక్కై నేను నిలువ వలయు
అబ్ధి కౌగిలి లోని అనుబంధము న్నిల్ప
పూర్ణిమా బింబమై పుట్టవలయు
అమ్మ మనసులోని అనురాగముం దెల్ప
ఒడి బిడ్డనై నేను ఊగవలయు

ఆకు మడులందు పచ్చని ఆకు నగుచు
పొడుగు జడయందు చామంతి పూవు నగుచు
బ్రతుకవలె గాని ఆశల బండిలోని
కాడి ఎద్దైతి నేమిది? కర్మగాని! 1

నేనొక మబ్బుతున్కను వినీల విశాల నభమ్ము నంటెదన్
నేనొక పూలమొక్కను, వినిర్మల భావ సుగంధ మద్దెదన్
నేనొక వాయువీచికను నీ హృదయమ్మున నూయలూగెదన్
నేనొక అశ్రు బిందువును నీ కనురెప్పల నంటి వ్రేలెదన్ 2

అష్టావధాన కష్టావలంబన మన్న
సచిను టెండూల్కరు షాటు మాకు
శతఘంట కవనమ్ము సలుపు సంగతి యన్న
కపిలదేవ్ బౌలింగు కరణి మాకు

ఆశుధారా కవిత్వా డంబరం బన్న
బ్రౌండ్రీల సిక్సర్ల భంగి మాకు
అప్రస్తుతంబుల నడ్డుకొనుట యన్న
సాచికొట్టిన బంతి క్యాచి మాకు

వేయి పద్యాలు ధారణ సేయుటనిన
హేలగా గవాస్కరు సెంచరీలు మాకు
ప్రకటితం బవధానమ్ము క్రికెటు క్రీడ
జయము గూర్చ అంపైరు సంచాల కుండు.

* * *

# నమస్సు

**– బులుసు వేంకటేశ్వర్లు**

తల్లీ! నిన్ను దలంచి పుస్తకము చేతంబూను నా శైశవం
బెల్లన్ - సద్గురు మార్గదర్శిత ఫలంబే గుండెలన్ నిండి - సం
ఫుల్లంబై - బ్రతుకెల్ల నీ పదసుమమ్ముల్ గొల్చు కాంక్షాలసత్
వల్లీ మంజుల భాసురంబగు మహద్భాగ్యంబె దీపించెడున్!! 1

అంధీ భూతములైన మార్గముల గర్వాంధ్యమ్మునన్ రేగు నా
డెందమ్మున్ సవరించి యీ 'ఉలిపి కట్టెన్' తీర్చిదిద్దంగ - నీ
కందోయిన్ ప్రభవించు రాగ రస రేఖా దివ్య కారుణ్య స
త్సందర్భమ్ములయాచితార్థములుగావా? తల్లి!! చింతింపగన్!! 2

రెప్పలు విప్పి లోకము చరించిన దారులు చూడబోక - మా
గొప్పదనంబె గాంచుడను ఘూక కులాభరణమ్ము లుర్విపై
విప్పిన స్వార్థపూరిత విభేదములెల్ల తొలంచగా నికన్
ఒప్పులకుప్పవై నిలచియుండుమ - చిత్తములోన - పొత్తమా!! 3

తల్లి! నీదు కరుణ తలకొన్న నాడైన
బ్రతుకు - క్రొత్త పుటల పరిమళంబు
పుటల నడుమ భద్రముగ పవ్వళించిన
నెమ్మి పింఛియమ్ము సుమ్ము - తలపు!! 4

తరతరాల జ్ఞాన ధారల కాణాచి
విశ్వనాగరకత వేఱుపట్టు
సభ్యతా ప్రదాత్రి - శాంతదాయినియైన
గ్రంథ సుందరి కిది - కవి నమస్సు!!'' 5

**(1996 డిసెంబరు 7వ తేదినాడు విశాఖపట్టణంలో జరిగిన నాల్గవ పుస్తక మహోత్సవ వేదికపై చదివిన పద్యాలు)**

* * *

# కుశస్థలీ! కుశలమా?

–ఆచార్య వి. రామచంద్ర చౌదరి

ఓ తల్లి! యో కుశస్థలి!
యాతత పులినాంక నిన్ను నాత్మందలంపన్
మా తాతలు ముత్తాతల
ప్రాంత చరిత్రములు వచ్చి పడు నామీదన్. 1

ఓ మదీయ జన్మ భూమీ! మహాస్వర్గ
నికట వర్తినీ! పునీత చరిత!
ఏండ్లు పూండ్లు గడచె నెందఱు నిన్ను ద
ర్శించి ధన్యులైరొ చెప్పవమ్మ? 2

పేరు సార్థకముగ సూరెల నేపుగాఁ
బెరిగియుండు దర్భ పెల్లు తోడఁ
గాకి వెదురు తోడఁ గమనీయ వృక్ష సం
తతుల తోడఁ జూడఁదనరె దీవు. 3

మిలమిలలాడు నీ యిసుకమేటలపై శయనించి, మింటిపై
వెలిగెడి చుక్కలన్ గనులు విచ్చుక చూచి సుఖించు భోగముల్
తలఁపునఁ బాఱి నా హృదయ దర్పణ మందొక కోటి చిత్రముల్
తళుకు తళుక్కున న్మెఱసి త్రవ్వుచున్నవి నాటి గాథలన్. 4

ఏనాటిదొ నీ రూపమ
దే నాటిదొ నేలటూరు! ఇరువుర బంధం
బే నాటిదొ! నిను బాడఁగ
నీ నాటికి నేను జన్మమెత్తితిఁ దల్లీ! 5

సాగిన యంత దూరమును సస్యములన్ ఫలవృక్ష జాతులన్
సాగొనరించి భుక్తి నరజాతి కొసంగెడి పుణ్యరాశి వే
త్యాగమయీ! కుశస్థలి! ముదంబున నిన్గొని యాడఁగా జనుల్
సాగుమ యెల్లకాలము రసాకృతివై సికతా ప్రహాసవై! 6

వెన్నెల రేలలో నిసుక వెండివలెన్ మెఱయంగఁ జల్లనై
కన్నుల విందు సేయు నిను గానఁగ వచ్చి, హుషారు హెచ్చి యె

న్నెన్ని విధాల యాటల వ్యయింతురు కాలము దూది మెత్తలా
నున్నని నీదు వాలుకల నూత్న సుఖానుభవమ్ముఁ బొందుచున్. 7

నీ బాగుఁ దలఁచి నంతన
నా బాల్యము గుర్తు వచ్చి నన్నెస రేపున్
నీ బంధుర వృత్తము కవి
తా బంహిష్ఠమయి రూపుదాల్చును దేవీ! 8

నేచిన వారలెల్లఁ దగనిల్చి నమస్కృతి సేయదగ్గ వే
దాచలమయ్యవా రనుఁగు లౌ తమ శిష్యులకెల్ల పాఠముల్
వాచవిగాఁగఁ జెప్పి వఱువాతనె మంత్రము చెప్పి కొంచు స్నా
నా చరణార్థమై దరియునా నిను నిప్పటి కట్లె తోఁ చెడిన్. 9

సొంతదారులు కంఠశోషగా ఘోషింప
లెక్కింప కుండఁ జెట్లెక్కి విఱిచి,
మెల్లియల్గైకొని మేలమ్ము లాడుచుఁ
జిల్ల పెంకుల మీఁదఁ జేర్చినిలిపి,
ఎంత దూరమ్మేని నిసుమంత విసువక
యెఱ్ఱని యెండలో నెగిరి యెగిరి
తిండి తీర్థాల కొత్తిడిసేయు తలిదండ్రు
లకు నందకుండ మూలలకు నొదిగి

ఆఁకలిన్ దప్పియున్ లెక్కలేక యుండ
నిసుక వాలుల వెంట హేహే యటంచు
బాలురం గూడి పరుగులు పాఱి పాఱి
యాడుకొన్నాను ''కోతి కొమ్మచ్చి'' యాట! 10

ఏ కొమ్మ గన్పింప నెక్కి-యుయ్యెల లూగి
ఇసుక తిన్నెల మీఁద నెగిరి దూఁకి
ఏ పిందె గన్పింప నిట్టె త్రుంచుక వచ్చి
గొప్పగాఁ జూపించి చప్పరించి
ఏ చెట్టు గన్పింప నిదె చూడుమని బోదె
పట్టుక పైకెగఁ బ్రాఁకి ప్రాఁకి
ఏ పూఁత గన్పింప నెట్లుండునో చూత
మని నోట వైచి 'తుప్పు'నుచు నుమిసి,

నీదు దరులంటియున్న వృక్షాదులం
చెలఁగి స్వేచ్ఛా విహారమ్ము సలిపి సలిపి
అమ్మ యొడిలోనఁ బండుకొన్నట్లు హాయి
మెఱయ నీ పులినమ్ముల నొఱగిఁనాను! 11

అల్లో నేరేడు పండ్ల నార్బాటముగఁ గడ్గి
చెలమ నీటిని పాడు చేసి వైచి,
''ఎవరమ్మ యీ నీటినిట్లు చేసి'' రటంచు
నుఱుము కాంతల కందకుండఁ బఱచి,
తడిదారి నొకవైపు త్రవ్వి పెంకులు గప్పి
ఎరువు బండ్లొరగ నెయ్యెడనొ దాఁగి
చింత పిందెల నుప్పు చేర్చి పచ్చడి చేసి
నాకు నీకని మ్రింగి నాల్క- చూపి

ఏఱు పిడుకలఁ దెచ్చి నిప్పెనయఁ జేసి,
బండపై నాకుపసరుమ్మి గుండు విసరి
ధామ్మనుచు నప్పువెడలు శబ్దమ్ము వినియు
పరవశింతు నా వేడ్క- చొప్పడున నేఁడు! 12

ఉమ్మెత్త కాయతో నొగి గాయ మొనరించి
చేతిపై నెత్తురుల్ చిందఁ ద్రిప్పి,
బిళ్ళాటలో వీఁచు బిళ్ళల నవలీలఁ
జేతులు కమలంగఁ జెలఁగి పట్టి,
చెడుగుడులాడి కచ్చెలు రెఁగ ధర్మమ్ము
స్థాపింప ముష్టి యుద్ధములు చేసి,
పంతమ్ములాడి దోర్బల మొప్ప మల్ల యు
ద్ధము చేసి, విజయోత్సవములు నెఱపి

అవల నేన్నెన్నొ వీర కృత్యము లొనర్చి
డస్సి యుస్సురుమని నిన్ను డాసినంత
ఆదరమ్మున నీ పులినాంకమందు
సేదదీర్తువు నను నీవు చిన్ననాడు! 13

సైకతరాసులన్ మధురసంబులఁ గ్రేణి యొనర్చు శీతలా
స్తోక జలమ్ములఁ దరళ సుందర మీన డిభంబులఁ మనో
జ్ఞాకృతిఁ దాల్చు నీ విభవ మారసి ధన్యతఁ గాంచె నేత్రముల్
ప్రాకట పూర్వజన్మ భవ పాప సమస్తముఁ బాసె నేటితోన్. 14

ఎన్నఁడు పుట్టినాఁడనొ మఱెన్నఁడు నీ మృదు తీర భూములన్
జిన్న తనమ్మున న్గవిత నేర్చిన వాఁడనొ! చెల్లిపోయె ని
ట్లెన్నొ సుదీర్ఘ వత్సరములిప్డును నీదు మహత్వమెంతొ యా
త్మోన్నతి నిచ్చి నా కవిత నోముచు నున్న దదృశ్య శక్తియై! 15

పిద పిద మాటలాడు కడుఁ బిన్న వయస్సున యందె నీ శుభ
ప్రదమగు సైకత స్థలులపై నడయాడఁగ నేర్చినాఁడఁ బ

న్నిద మిడి కట్టినాఁడఁ గడు నేర్పునఁ బిచ్చుక గూళ్ళు నేటికిఁ
జెదరదు నీదు రూపమిది చిత్రము నా వయసేమొ హెచ్చెడిన్. 16

ఎందఱఁ జూచినావొ! యిపుడెందఱఁ జూచుచు నుంటివో! మఱి
న్నెందఱఁ జూడ నుంటివొకొ! యేమని నిన్ను నుతింతు నమ్మరో!
యిందఱిలోన నొక్కఁడను, నేను నొకానొకనాడు వాలుకా
సుందరమైన నీ కడుపు సొచ్చి యడంగుదునో కుశస్థలీ! 17

పెండ్లి పందిరివోలెఁ బెద్ద గ్రామమ్ము పైఁ
గ్రమ్మిన నీలాంబరమ్ము విడిచి,
పుష్పసౌరభ మెల్లఁ బుక్కిలించిన యట్టి
మైనమ్ము పదనైన మట్టి విడిచి,
ఏ పురాజన్మ సుకృతమొకో యీ జన్మ
మిడినట్టి పితరులనేని విడిచి,
బాల్యమ్మునందె మద్భావమ్ములకుఁ గవి
త్వాకృతి నిడిన నీదరులు విడిచి,

బ్రతుక వలసెను నరకమ్ము పాటియైన
నగర సీమల నర్థ హీనంపు బ్రతుకు
కైతకై జీవిత మ్మెత్తు కట్టినట్టి
యస్మదీయ తపః ఫల మమరు టెపుడొ! 18

చిననాఁడు నేను పొందిన
యనుపమ దివ్యాను భూతి కడియఁడనై నా
యనుభూతిఁ గైతగా మలఁ
చిన వాఁడను, కొనఁగదే శుచిప్రద! జననీ! 19

# భరత మాత

-శేషం సుప్రసన్నాచార్యులు

ఆర్ష విజ్ఞాన మహో దివ్యదీధితుల్
ప్రసరింప జేసిన ప్రాజ్ఞగరిమ
ఋగ్యజుస్సామాది రుచిర వేదములెల్ల
భాసింప జేసిన భావపటిమ
అనురాగ బంధమ్ము, అతిశయ మొందించు
బుద్ధ కృపావృష్టి పుణ్యఫలము
శ్రీ వివేకానంద సింహ గర్జన తోడ
విస్తుపోయిన విశ్వవేది సాక్షి

ఆది నుండియు అమృతమ్ము నందజేయు
ధీ మహాత్ముల సృష్టిచే తేజమలరి
తనదు బిడ్డల క్షేమమ్ము తరచి చూచు
ప్రాభవోజ్జ్వల పరిపూత! భరతమాత!

భారతీయుల శక్తి భాసింప జేసిన
''పురుషోత్తము'' ని మహాపుణ్య ఫలము
భరత జనని నెల్ల భక్తిగా గొలిచిన
''రాణాప్రతాపు'' ని రమ్యగుణము
భరతనారీ ప్రతాపమ్ము చూపించిన
''ఝాన్సి లక్ష్మీబాయి'' సమర పటిమ
భారతాంబిక గౌరవమ్ము కాపాడిన
''ఛత్రపతి శివాజి'' సాధ్య మహిమ

'పృథ్వీరాజు'' ని కరవాల పృథుల శక్తి
''రుద్రమాదేవి'' మీటిన రౌద్ర వీణ
ఫలితమే నేటి స్వాతంత్ర్య ఫలముగాగ
వరలు నిత్యాన్నదాత! మా భరతమాత!

## గురుస్తవము

–ఆచార్య ఫణీంద్ర

(శ్రీ) 'నందూరి' కులైక భూషణుడు - నిశ్శేషాంధ్ర సాహిత్య సు
జ్ఞానానంద మయుండు - స్వచ్ఛమగు బంగారంపు పద్యంబులన్
నానా రీతుల కావ్య భూషలుగ తానందించి ఆంధ్రాంబకున్,
ఈనాడాతడె ఆంధ్ర పద్య కవితా సంస్థేశ్వరుండై తగెన్. 1

'రామకృష్ణమాచార్య' సునామధేయు
డెపుడొ, ఏబదేడులనుండి ఏకధాటి
పద్య కవితలన్ సృజియించి పండిపోయె,
మహిని పద్యకవిత కతడు మారుపేరు. 2

'తారా తోరణము' తెలుగు
సారస్వత భువన భవన సంయోజితమౌ
ద్వారమునకు కట్టి, అతడు
ధారుణిపై నవ్య కాంతి ధారలు కురిసెన్. 3

'ప్రగతి గీత'ను ప్రవహించి ప్రజలు కొరకు,
నవ్య కృష్ణుడు సార్థక నాముడయ్యె-

ఆంధ్ర భాషామతల్లికి అందమయిన
నెలవు, 'కవితా ప్రభాస' ను నిలిపె నతడు। 4

కువలయముననున్న కుటిల నీతిని ఎత్తి,
కుండ బ్రద్దలట్లు కొట్టి, చూపి,
అభ్యుదయ పథమును, హాస్యమ్ము జొప్పించి,
వెలయజేసినట్టి విప్లవ కవి। 5

అతుల కవీశ్వరుండు, కవితాంబకు ముద్దుల పట్టి - పండిత
స్తుత ఘన సాహితీ కుసుమ శోభన వాటికయందు మేటి క
ల్ప తరువు - మాధురీ రసమపారము నిండిన పద్య శిల్పముల్
శతములు చెక్కుచున్, పలుకు శాసనమౌ గురుదేవు మ్రొక్కెదన్। 6

## అమృత వర్షిణి

–నెమ్మలూరి సత్యనారాయణ మూర్తి

అమ్మకు సాటిరావు పెరుగన్నము చిక్కని పాలమీగడల్
కమ్మని మిన్నసున్ని పరికల్పిత తామరజుంటి తేనియల్
పమ్మిన చెఱ్ఱు పానకము బంగనపల్లి రసాలు, ద్రాక్ష పా
కమ్ములు, పారిజాత సుమ కల్పితముల్ మకరంద మాధురుల్. 1

అమృత వర్షిణి అమ్మ ప్రేమామృతంబు
నా అయోనిజుల్ బ్రహ్మయు హరియు శివుఁడుఁ
గ్రోల నత్రి భార్య యొడినిఁ గొర్కెతీర
జోల లూగిరి శిశువులై సోలిసోలి. 2

మూత్ర పురీష దిగ్ధ కఫముల్ తనువెల్ల నిండ, నేలపై
పుత్రకుఁ డేడ్చుచుండ, తన భోజన కాలమునందునైన, నే
మాత్ర మసహ్య భావమను మాటకుఁ జోటిడఁబోక, నవ్వుచున్
ధాత్రికి నీడుగా సహనతత్వము చూపెడి అమ్మ! మ్రొక్కెదన్. 3

'అమ్మ మనసు వెన్న' అని పోల్పఁ దప్పౌను
వెన్న కఱఁగు దనకు వేడి కలుగ
అమ్మ కఱఁగు సుతుల ఆర్తి వినినయంత
అమ్మకొక్కసాటి అవని లేదు. 4

నవమాసంబులు మోసి, గర్భమునఁ దన్నన్ సైచి, వక్షంబు పై
నవియన్ దన్నినఁగాని, జ్ఞానమయ జీవాధారదుగ్ధామృతో
ద్భవ తేజస్కునిగా సుతున్ పెనిచి, పెద్దన్ చేసి, నీ యాయు వీ
యవె? ఓ త్యాగమయీ! కృపాశరధి వమ్మా! నీకు కై మోడ్చెదన్. 5

పచ్చని చీరఁగట్టి తలపై విరబూసిన పారిజాతముల్
ముచ్చట గొల్పఁగా ముడిచి, పుష్పాడి గంధము మేనఁదాల్చి, నా
యిచ్చలు దీర్చ బ్రోచుటకు నీ భువికిం దిగి కల్పవృక్షమై
వచ్చితివమ్మ! నీ కడుపు పంటను నన్నిలఁ బ్రోది చేయగన్? 6

చౌర్యము నంటగట్టి తమసంబున అత్తను (అమ్మను) వెళ్ళగొట్టగా
భార్యకుఁ జెప్పలేక, తన బాధ్యత నించుక నెంచఁబోక, ని
ర్వీర్యుఁడు పుత్రుఁడే తనను వృద్ధజనాశ్రమ మందుఁ జేర్చ, నౌ
దార్యమె చూపుఁ బుత్రుపయి - తల్లిని మించిన దైవమున్నదే? 7

అమ్మంటె యెవ్వరు? అమృతంబు వర్షించి
మేదినిఁ బండించు మేఘమాల,

అమ్మంటె యెవ్వరు? అవనికి దీటుగా
సహన శక్తిని జూపు శాంతమూర్తి
అమ్మంటె యెవ్వరు? ఆయురారోగ్య భా
గ్యంబు లొసఁగునట్టి కామధేను
అమ్మంటె యెవ్వరు? స్వార్థంబు నెఱుఁగక
తేజస్సు నిచ్చెడి దీప కళిక

ఆమె యెవ్వరో కాదు - పాపాగ్ని నార్పు
ప్రళయ జర్ఝా మరుత్ క్రోధ వర్షధార,
ఆమె యెవ్వరో కాదు - శాంతాత్మ యగుచు
పసిడి పంటల నిచ్చెడి ప్రకృతి మాత. 8

నీవు చెప్పక ముందు నేనెవ్వరికి నేమి
అమ్యేదనొ యెఱుగనమ్మ సుంత,
నీవు నేర్పక ముందు భావంబు, భాషయు
రానట్టి ఒక పదార్థంబు నేను,
నీవు తెలుపక ముం దీ విశ్వ భాండార
వస్తు పరిజ్ఞాన నాస్తికుఁడను,
నీవు చూపక ముందు జీవయాత్రా లక్ష్య
సంగతు లెఱుఁగని పంగు నేను,

నీవు మలచిన (శిల్పంబు) బొమ్మను నేను తల్లి!
నీ వొసంగని వేవియు లేవు నాకు -
నీవు నేననుభావంబు నే త్యజింతు,
అమృత వర్షిణీ! నీకు జోహారు లమ్మ! 9

# తస్మాద్ జాగ్రత

- ఏలేశ్వరం మాధవాచార్యులు

పుక్కటు సొమ్ముగాఁదలఁచి ప్రొద్దున ప్రొద్దున మిర్పకాయకే
కక్కురితేల వాయసమ! కాసులు బెట్టి ఖరీదు జేసినా
నిక్కడి సంతలోన, పద నింకుట కెండన బెట్టినాడ, నీ
వెక్కడి నుండి వచ్చితి విసీ! చిరజీవి యశమ్మిదేనటే! 1

స్వోదర పోషణార్థ సమయోచిత సాహస కార్యధుర్య! మ
ర్యాద జనాగమోక్త శకునాఢ్య! మనః ప్రియకార కోకిలా
హ్లాద కృతోద్యమ ప్రకర హార! వికార గుణాలవాల! మి
థ్యా దరణీయ బాంధవ! భయంకర దృక్పథ వక్ర విక్రమా! 2

ఖాద్య విసర్జితాన్న మయ కల్మష గంధ పదార్థ శేష నిం
దాద్య బహిః ప్రదేశ సముదంచిత మార్జన సత్ప్రవర్తనా
పాద్య మహీసవర్ణ గుణభాసిత! కర్ణ కఠోర కాకలీ
వాద్య విశేష! ఘూక చయవైరి కళంక మనో విచారణా! 3

కాకమా! మిర్పకాయలె కావలసిన
తోట లెన్నెన్నొయున్నవి తొంగిచూడ
నీ ప్రతాపము చాలక నిమ్నజనుల
కెగ్గుసేయఁ దలంచితే సిగ్గులేక. 4

బలిభుగ్రాజ మిదొక్క దొంగతనమే మన్నింతమో యన్న కా
వలి లేకున్న సమస్త మేలెదవు సర్వం స్వాహ యంచున్ బలా

బలమున్ జూపెదవో ప్రగల్భ వచనాభ్యాసంబులో ''కావు కా
వు'' లచే నాత్మబలంబు జీరెదవహో యుద్ధానికో యాతకో. 5

పరుల సొమ్మటంచు భయమింతయునులేక
తిన్న తిండి మేన దిగక యున్నె
ఒంట బట్టి పిదప యో రామచంద్రమా
''కావు'' ''కావు'' మనెవు కలవరమున. 6

(నా ''జ్యోత్స్నాలహరి'' కావ్యము నుండి)

# కవి స్వగతం

**- బులుసు వేంకటేశ్వర్లు**

శ్రీ వాణీ చరణకమల
సేవా భాగ్యమ్మ మిగుల సిద్ధించిన స
ద్భావులు - పెద్దలు - మిత్రులు
శ్రీ వాణీ సమితి హితులు, చేకొనుడు నతుల్!! 1

ప్రాక్తన సత్కవీశ్వర ధురా మధురాస్పద వాగ్విలాస సం
పృక్తము తెల్గు సాహితి - తపించిన గుండెల గాంగధారయై
వ్యక్త మనోహరార్థ పరిభాసితమౌచు - తలంపులందు న
వ్యక్త మనోహరార్థ పరిభావితమౌచు వెలుంగఁ గోరెదన్!! 2

పాత్రుడ నౌదునో! బిరుదుపట్టమ!! నీ విరహార్తులౌచు నే
రాత్రియు నిద్రవోని కవిరాజులపై కరుణింపరాదటే!
చిత్రముగా - విరాగిని - వచింపగ గొప్పదనంబులేని యీ
మాత్రపు చిన్నయౌ కవిని మన్నన జేసితి వెంతబేలవో!! 3

ఈనాడీ గతి 'మారుటూర్' ప్రజలు నెంతే ప్రేమ వర్షించి - నా
పై నిర్వ్యాజ మహాభిమానములఁ జూపన్ వారి సౌజన్యమే
కానీ - నాయెడ పెద్దసేయదగు భాగ్యం బేమియున్ లేదు - నీ
ధ్యానమ్మొక్కటి దక్క రే వగలు - మాతా - జ్ఞాన రూపాత్మికా!! 4

కవి పదంబును మించిన ఘన బిరుదము
లేదనుచు నమ్ముచున్నాడ నాదినుండి
నటిత శివపాద మంజీర నాదము కవి
తల్లి మ్రోయించు కచ్ఛపీ తంత్రియె కవి!! 5

(విశాఖపట్టణం జిల్లా - అనకాపల్లి మండలంలోని మార్టూరు గ్రామంలో శ్రీ వాణీ సారస్వత సమితి వారు **9-3-97** నాడు నన్ను సన్మానించి, 'కవి వతంస' అనే బిరుదు ప్రదానం చేసిన సందర్భంలో ధన్యవాద పురస్సరంగా సమర్పించిన కవిత.)

# చేఁప

- తమ్మన వేంకటేశ్వరరావు

ఉ. చేఁపల కంపటంచు నను చీటికి మాటికి చీఁదరించికో
నోపు ప్రబుద్ధులార! జగమూరక యేమియొ యుద్ధరించిన
ట్లూపిరి బిగ్గఁబట్టి పడియుండఁగ నే లెవరెంత యేడ్చినన్
చేఁపనెనేను, నాదయిన జీవిత మంతయు మీ సుఖాప్తికే! 1

మ. మనుజాక్షుల్ మనుజాక్షులంచు నెపుడున్ మా యింతులం బిల్చుకోఁ
జను పాపంబున మేము పోయితిమె? మీ సౌందర్యమున్ బెంచు సా
ధనముల్ మేమగుటన్ సతంబును మమున్ ధ్యానించి మీనాక్షులం
చును మీయింతులఁ బిల్చికొందు రిది మీకృతజ్ఞత్వమున్ దెల్పదే? 2

మ. మనుజుల్ మీరొకవేళ మోహ సుమనో మైరేయ పాన భ్రమ
న్మన ఉన్మత్త శిలీ ముఖేంద్రు లయినన్ మన్నింపఁగా వచ్చు; నిం
కను గీర్వాణులు కూడ మా వెనుకనే కాలూని మీనాక్షు లై
మనుచున్నారుగదా సపర్యలను సంవర్ధిల్లుచున్ గుళ్ళలోన్? 3

సీ. మనుజ సంస్కృతి కెల్ల మనికి పట్టై తోఁచు
నామ్నాయముల సోమకాసురుండు
అబ్జ సంభవునుండి యపహరించి యఖండ
చాతుర్యమున నదృశ్యంబు కాఁగ
అంత కంటెను సమభ్యధిక చాతుర్యంబు
దృశ్యమాన మొనర్చి తీవ్రమైన
పాఠీన రూపంబు పాటించి నే నహో
ఆ మహాసురుని వెన్నంటి తఱిమి

గీ. అస్మదత్యుగ్ర నిశిత దంష్ట్రాంచలమున
వాని నలవోకగా గ్రుమ్మివైచి క్షణము
లోన వేదాల శారదా లోలునకును
అప్పు తీర్చినట్లే యొప్పఁ జెప్పలేదె? 4

శా. నాకేమంచును నేను నూరకొనుచో నన్నెవ్వ రేమందు రీ
లోకంబం? దయినన్ నరప్రగతి నాలో నించి కాదే మహో
త్యేకస్ఫూర్తిని నింత చేసితిని? నా దీప్యన్మహా సాహస
ప్రాకట్యంబును పేర్కునైన స్మరియింపన్ రాఁడొకండేనియున్. 5

శా. వేదంబు ల్విభజించి పంచమ మహావేదంబనం జెల్లు జ్ఞా
నాదిత్యంబగు భారతం బిల కమేయ ప్రజ్ఞనర్పించు న
వ్వేద వ్యాసుఁడు నాదు మన్మఁడు సుమీ! విద్యా మహా సంప్రదా
యాది ఖ్యాతికి నేనె మూలమని నేఁడైనన్ గ్రహింపందగున్. 6

ఉ. వ్యాసుని తల్లి సత్యవతి యస్మ దనిందిత గర్భవాస వి
న్యాసముచే పవిత్రమయినందునఁ గాదొకొ మత్స్యగంధిగా
వాసి గడించె? నా పయిన వర్తిలు యోజన గంధి నామ ము
ల్లాస విధిన్ పరాశర విలాస విశేషము గాక యన్యమే? 7

మ. కొనగోటన్ జిఱు బంతివోలె త్రుటిలో కోలాహలాద్రీంద్రు నూ
పునఁ ద్రోపాడి యభి ప్రదత్త మఘవా పూర్వస్థిర స్నేహ యో
గనిధానానుభవాను మోదమున నాకాశాన వాహ్యాళిగాఁ
జననౌ నా వసురాజు నా ప్రియుఁడనన్ సత్యంబుగాదందురే? 8

ఉ. మానిత మానవాభ్యుదయ మాంసలమై కనుపట్టు కోట గు
మ్మానకు భాగ్య చిహ్నముగ మమ్ము బిగించియు మాదు పేరు పై

నే నగరంబుఁ బిల్చికొను హృద్యసనాతన దివ్య సంస్కృతి
శ్రీనిధి మీ మనుష్యులు వరించి భుజంబుల మోపు కొంద్రెకా? 9

సీ. ఆకసంబున రాసులందు నా ప్రాచుర్య
మణు మాత్ర మెవండు కాదనఁగలండు?
నా యంత్రమును గొట్టి నరుండింతిఁ గొనఁగాదె
పాండవుల్ గేస్తులై పరిఢవిలిరి?
అల యక్ష ధర్మరాజుల ప్రసంగము కూడ
నన్ను విస్మరింప లేదనుట వినరె?
ఇంత గొప్ప చరిత్ర నెనయు నన్నే చంపి
తిన వలెనే నేఁడు మనుజులార?

గీ. మమ్ము పెంచి నట్టులె పెంచి మాయ చేసి
ఒడ్డునను వైచి ప్రాణంబు లుండునన్న
భయముతో మంచు ముక్కల పాఱఁజిమ్మి
యొగ మతులు చేసి ధనము నార్జింతు రకట ! 10

# ''మదరిండియా - '92-!''

- జ్వాలాముఖి

మహానగరం మోహాంధకారం
మహానాగరికత, మాంసల వ్యాపారం
శరీరాల సంత ఆత్మల బహిష్కారం
యౌవనాల సమాధి జీవితాల నిషేధం

ఎర్రని దీపం కర్రనైన ప్రాంతం
బహుళ జాతి కంపినీ కైలాసం
అది పీడిత తరుణీజన తప్త మహాద్వీపం
శోషిత స్వప్నాల విచలిత దుఃఖమనంతం

అక్కడ వయస్సు నాణ్యమైన సరుకు
అక్కడ బతుకు నిత్యనూతన నరకం
అంగడి అనుభవాల ఆర్తి, అణచివేత అపారం
'శరీర మాద్యం ఖలు ధర్మసాధనం'!

గుళ్ళు గోపురాలు ఎగురలేని పావురాలు
కూలిన కాపురాలు అవనత జీవితాలు
నీలిమంటల నిర్బంధంలో బ్రతుకు బీభత్సాలు
'భిన్నత్వంలో ఏకత్వం' బ్రద్దలయ్యే భౌతిక సత్యాలు

'త్రీ డబ్ల్యూలు' తగులబడే ఆ వైతరణీ తీరంలో
నిత్యం చేతులు మారే దుర్భర జీవితాలే అయినా
ఆత్మల వెలుగు ఆరనీయని నీతగత ప్రాణులు
అంతః కరణాల నారాధించే ఆర్తత్రాణ పారాయణులు

సుఖాల విలాసం షరా శ్రమదోపిడి
సుఖాలు కోరే సోకాల్డు సభ్యసమాజం
రోజు కో  వేషం గంట కో విశేషం
ఈ కపట నాటకంలో ఈసారి మాతావేశం

అయోధ్య కరసేవకుల మహాలయ అమావాస్య
సంపూర్ణ సూర్యగ్రహణం, అబద్ధాల వాతావరణం
దేశం అంధకార బంధురం, ఆరిన ఆత్మవిశ్వాసం
సాగిన మతరాజకీయం,చచ్చిన లౌకిక వారసత్వం

మసీదు కూలందే గుడిగంటలు మోగరాదని హిందూ హఠం
దేశభక్తి గుత్తసొమ్ము సాహుకార్ల త్రిశూల సంఘపరివారం
ప్రబుద్ధుల పాతాళహోమం, పాలకుల కపట లౌకిక వాదం
ఫ్యూడలిజం చావు తెలివి, క్యాపిటలిజం మార్కెట్ బలిమి

మర్యాదా పురుషోత్తముల ఆధ్యాత్మిక వికారం
శంకర పీఠాల రాజకీయ పరకాయ ప్రవేశం
లక్ష్మణ యతీంద్రుల, లక్ష్మణ రేఖాతి క్రమణం
జాతి సీతను చెరబట్టిన చిరకాల చిన్మయానందం

శంబుక  వధల్ని నిత్యకృత్యం చేసిన 'రామరాజ్యం'
జటాయుమరణం, శబరి ప్రాయోపవేశం
'భరత్‌మిలాప్', ఇక ఎన్నడూ సాధ్యపడని 'అయోధ్య'!
చెలరేగిన అజ్ఞానం చతికిలబడిన సంస్కారం!

ఆశ్చర్యం! అవతార పురుషుడు దేశ దుర్మార్గుల స్వాధీనం!
'శ్రీరాముడు', హిందూమతోన్మాదిగా ఫాసిస్టు కటౌట్!
దేశమాత చిరంజీవులు శ్రీరామకృపలో ఏకంగా వాషౌట్!
గాడ్సేల పునరుత్థానంలో శివసేనల నరమేధం నాటౌట్!

ఊపిరి సలపని దేశం, ఉనికి చచ్చిన ప్రభుత్వం!
పనికిరాని పార్లమెంటు, పసలేని న్యాయస్థానం!
విచికిత్సల రాజ్యాంగం, వివశత్వంలో 'శ్రీరామరక్ష' !
ఊరేగిన ధనస్వామ్యం, ఊసూరుమన్న ప్రజాస్వామ్యం!

దిక్కుతోచని జనం గుక్కపట్టిన మానవత
'మతం మత్తుమందు' నెత్తికెక్కిన 'ఏకాత్మత'
మనుషుల్ని మృగాలుగా దిగజార్చిన 'రామజన్మభూమి'
పరాయిదేశంగా వెంటాడిన నమ్మలేని మాతృభూమి!

హతశేషులు మందభాగ్యులు
మతం వాతబడ్డ దేశ దౌర్భాగ్యులు
మరణశిక్షను మోసే నిరపరాధులు
'దారిద్ర్య రేఖ' కింద పడి చచ్చే పౌరులు

ఆత్మీయుల శవజాగరణ
ఆపన్నుల మృత్యునిరీక్షణ
ఈ దేశంలో పుట్టిన పాపానికి
ఇక్కడ తెగిపడిన నిరుపేదలు

మతాలు, మట్టిమనుషుల్ని ప్రాణాంతకంగా వెంటాడిన వేళ
ప్రతీకార వాంఛలతో ఆసేతు హిమాచలం, ఉన్మాదం గావుకేక
'ఆర్యడంబం' మరోసారి 'విశ్వహిందూ' విషం కక్కిన చావురోజు
దిక్కుమాలిన ద్వీపకల్పం దీప్తిచెడిన దేశ ఔన్నత్యం! -

భూమ్యాకాశాలు నిండిపోయిన ఆర్తనాదం
మానవారామం కుప్పకూల్చిన ధూర్తవినోదం
ఎవరి నీడను చూసి వారు భయపడిన 'నమ్మక ద్రోహం'
మనిషి మనుగడతో 'రాం నాం సత్య్ హై' వేళాకోళం!

ఆత్మ బంధువులందరూ కళ్ళముందే కుప్పకూలిన కల్లోలం
ఒకరి కొకరూ పట్టకుండా పరుగెత్తిన మానవ మహోత్పాతం
మెజారిటీ అహంకారం, మైనారిటీ భూస్థాపితం!
జన్మసిద్ధ అధికారం, జన్మభూమి పక్షపాతం!

బిక్కు బిక్కుమనే 'బేకరీల' లంకాదహనం
బిలబిల మనే 'బేల్ పూరీలు' పరశురామ ప్రీతి
చౌపాటీ 'పావ్ భాజీ' ల ముసాఫిర్లు హతం
ఫుట్‌పాత్ చాయ్ పానీల చిరునామాల ఖతం

కూరగాయల బళ్ళు పళ్ళ బుట్టల మోళ్ళ
పేపరేసే వాళ్ళ పాలిష్ చేసే కుర్రాళ్ళు
చిత్తు కాగితాల పిల్లలు చెత్తనెత్తే తల్లులు
కావళ్ళు లేవిళ్ళు తగులబడే ఎముకల గూళ్ళు

ఆటోలు టాక్సీలు తేలాలు ట్రాలీలు
గుడిశలు గుడారాలు లారీలు గోరీలు
పల్లీలు గల్లీలు పోర్టర్లు మాస్టర్లు
రావణకాష్ఠం నెట్టబడిన అవరిండియా పోస్టర్లు

శ్రమ ఫలితం దక్కక మన్నుబుక్కిన మంచినీళ్ళు
మతవిశ్వాసం అక్కరకు రాక అస్తిత్వం పుంజుకో లేక
తలదాచుకునే చోటుకోసం తలతాకట్టు పడ్డవాళ్ళు
ఏ దిక్కూ లేనివాళ్ళు, ఎవరి జోలికీ పోని పాదచార్లు

కోటి విద్యలు రాక కూడు నోచుకోని పల్లెటూళ్ళు
కూలినాలి జనాలు గూడు గోడూ చెడిన జనానాలు
డాలరు పాపాలకు వికలాంగులైన చిల్లర దేవుళ్ళు
సంచార జీవులు, సవాలక్ష గోవులు, కమేలా దావులు.

ఉప్పు కారం తెలయని పుట్టు ఎంగిళ్లు
పులుపు చచ్చిన దుబాయి ఆకళ్లు
చీము నెత్తురు మోసే చిత్తడి చిన్నార్లు
విషాద భారతం విడిచేసిన వికల ఆనవాళ్లు

పొట్ట చేత పట్టుకవచ్చి మట్టికొట్టుక పోయిన ఆశలు
కుక్కవిశ్వాసం చూపి కుక్క చావు చచ్చిన రెక్క బొక్కలు
అన్ని భాషల ఘోషలు అన్ని మతాల పరాధీనతలు
దిక్కూ మొక్కూ లేని విషాదాలు చెల్లాచెదరైన అగాధాలు

సలాం బాంబే శరణులో సర్వం నాశనమైన శ్రమజీవులు
మతం పుట్టుమచ్చతో మృత్యుముఖం చేరిన మూగ దేహాలు
ఏ రక్షణా లేక ఆత్మరక్షణ చేసుకోలేని అమాయకులు
సామూహిక హత్యల్లో ఖండఖండాలైన ఆకలి కళాఖండాలు

''అయ్యా! చంపకండి! భయ్యా! వదిలిపెట్టండి!
మీ కత్తుల కసి దీర్చే కండలు మావద్ద లేవండి!
మీ త్రిశూలాల దాహం తీర్చే నెత్తురు మాలో లేదండి!
బతుకు దేవులాటలో తోలు ఎముకలే మిగిలాయండి!

మతం సంగతి మాకు తెలియనే తెలియదండి
కాయకష్టమే మా కైలాసం, ఆకలి యాత్రలు మా ఆవాసం
పొట్ట కూటికి వచ్చాం! పుట్టి మునిగి చచ్చాం!
మనిషి గుర్తింపులో మట్టి కొట్టుక పోయాం!

ఓటర్ల జాబితాలో చేరని వట్టి మోటుమనుషులం
రేషను కార్డుకు నోచుకోని అత్తాపత్తాలేని చచ్చువాళ్ళం
బతుకు పోరాటంలో అగమాగమైపోయిన పాగల్‌గాళ్ళం
కొన ఊపిరితో తాపాలమై తిరుగుతున్న శాపాలం

చావు పుట్టుకల రహస్యాలు తెలియని బిత్తరగాళ్ళం
మట్టిలో పుట్టి, మట్టిలో పాకులాడి, మట్టి మట్టైపోయే దుమ్ములం
ఉన్నదంతా ఊడ్చుకపోండి ఆ 'బరువు మనిషి'నైనా వదలండి
పుట్టబోయే పేగుకైనా పుట్టగతులు వదిలి పుణ్యం కట్టుకోండి

పాహిమాం! రక్షరక్ష! జై(శీ)రాంభీ అచ్చా అచ్చా!
మట్టిరుణం తీరింది మనిషి అర్థం తెలిసింది
'ఆఖిరీ నమాజు' చేసుకుంటాం అనుమతివ్వండి దొరా!
వినండి హుజూర్! చివరి కోరిక మన్నించండి సర్కార్!

ఈశ్వర్ అల్లా తేరేనాం! మందిర్ మస్జిద్ తేరే ధాం!
సబ్ కో సమ్మతి దే భగవాన్! హేరాం! ఓజీసెస్! వాహెగురూ!
చచ్చిన పాశాల మధ్య చావబోయే ఆశల మొర!..మాయ్‌బాప్!
అల్లాహో అక్బర్! అల్లాహో అక్బర్!! అల్లాహో అక్బర్!!!----

బయటపడే మార్గంలేని అరచేతి ప్రాణాల డస్సిన ధ్యానాలు
గుడ్డి తల్లిదండ్రుల్ని మోసే శ్రవణకుమారులపై రామబాణాలు
పాపం పంచుకునే 'జాతీయ నరమేధం'లో ఖాకీల ఠాణాలు
జనగణమన అధినాయక ఢిల్లీలో మౌనాంగీకారాల నిదానాలు.

దేశం కన్ను గప్పిన మతావేశం
నిజం పెదవి విప్పనీయని జాతీయ జులుం
గుట్టు చప్పుడుకాని రుద్రాక్షపిల్లి మౌన హుకుం
రామనామ తారకం రాజకీయ మారకం

బొంబాయి వీధులన్నీ శివోహం శివోహం
'వీధిహారతుల్లో' బిల్లర్లకు దాసోహం దాసోహం
మధ్యయుగాల మత కటాక్షం! బీబీసీ వికృత గవాక్షం!
దరిద్ర నారాయణుల నిర్ధామ ధామంలో మానవతా దుర్భిక్షం!

అప్పుడు, అప్పుడు, ఏ చప్పుడూ వినపడనప్పుడు
ప్రతి అలికిడి చావు పలకరింత అయినప్పుడు
బతుకు బీభత్సంలో ఆరాటం కాలు కాలినప్పుడు
'అన్యధా శరణం నాస్తి, త్వమేవ శరణం మమ'!

అమ్మల గన్నయమ్మ మురికి కూపాల మూలపు టమ్మ
ఒకే ఒక రూప శాపంతో ఇంతకాలం కడగండ్ల పాలైన దుర్భర జన్మ
ఆర్ద్రతేజంతో ఇప్పుడు కడతేరిన అపూర్వ 'సంఘీభావం'
ఆపన్నుల అక్కున జేర్చిన ఆప్తవాక్య! ఆవిర్భావం!

అన్ని ద్వారాలూ మృత్యుద్వారాలై భయపెట్టినప్పుడు
గుండెద్వారాలు తెరచి, గుండె జారినవారి కండగా నిలిచింది
బయటివిలువలు బట్టబయలై అనాగరికత చెండినప్పుడు
'యమకూపం' చీల్చుకవచ్చి సాంఘిక సరిహద్దులు చెరిపేసింది

త్రివర్ణ పతాకం సిగ్గుతో తల దించేసుకున్నప్పుడు
పాతాళ గంగలా పొంగపార్లి దేశం గాయాలను
పైటతో తుడిచి 'మానవతా పతాకం' ఎగురవేసింది
చచ్చిన హృదయంలో, విచ్చిన సంస్కారం జాతీయగీతం పాడింది.

ఎవరు? ఎవరు? ఎవరు? ఎవరీ మాతృమూర్తి?
దేశమాత ఆర్తికార్యం తీర్చిన మానవతా స్ఫూర్తి!
ఇంతకాలం రామాయణం రంకుల్ని, భారతం బొంకుల్ని
భరించిన పీడకలల క్షతగాత్రి! చితిచింతల వేగిన సుగాత్రి!

మత కక్ష లేదు కుల విచక్షణ లేదు
లింగ వివక్ష లేదు భాషల అపేక్ష లేదు
మనిషి చచ్చిన విషయ ఘడియల్లో హత్తుకున్న అమృతహస్తం
అంతా మానవ భాష ఆత్మసంస్కారాల అభయహస్తం -

ఆరని కుంపటిలా తన దుఃఖం, లోన రగులుతున్నా
ఆపన్నుల దుఃఖాలకు ఆశ్రయమిచ్చిన ఆర్ద్రనేత్రం
దేశం గొడ్డు పోలేదని చాటిచెప్పిన ఆత్మ సంస్కారం
కన్నీటి రద్దుగోరే 'కాంగార్ల'తో మమేకం చెందే లోక కల్యాణం

రచ్చకెక్కిన 'రామచరితమానసం' లో
పోరాడి నిలిచిన ఆత్మ సాక్షాత్కారం
'ఏకపక్షనీతి' పై నిప్పుల నిజాల తిరుగుబాటు
మతం దివాలాలో మనిషి హవాలా గుర్పాటు.

కష్ట జీవుల జాతి ఒక్కటేనని కంటి కాగడాలు దట్టించి
'మహోదయం' దారి చూపిన 'శరణాగతి కావ్య-కర్తవ్యం'
ఆత్మవిశ్వాసాల్ని పునరుద్ధరించిన 'అహల్యాద్వీప- ఉత్తేజం'!
సంఘటిత పడందే విముక్తిలేదన్న పీడితుల యుగ చైతన్యం!

చీకటిధ్రువాల శిథిల సమాజంలో
'అరుణతార' గా వెలుగులు విరజిమ్మిన 'రెడ్‌లైట్ ఏరియా'
'విముక్తిపోరాటం' ముందుకు తెచ్చిన 'మదరిండియా'
''తవ శుభ నామే జాగే గాహే తవ జయ గాథా''!.....

(18-7-1995)

* * *

# అంతర్ ఘోష!

-నిఖిలేశ్వర్

అపార జలసింధువులోని
నిరంతర అంతర్ వాహినిలో
చలనంలేని నీటి బిందువు లేదు,
మరణంలేని కెరటాల ఆరాటంలో
ఈ సముద్ర ఘోష ఏనాటిది?

ఆదిలో ఆరంభమైన చలనం
అనంతంగా నిరాటంకంగా నా ఎదుట.
అవిరామంగా అవిశ్రాంతంలో దూకే అలలన్నీ
తీవ్ర మోహావేశంతో విజృంభించి
పరస్పరం తరిమే కోరికలతో
ఎందుకీ సముద్రుడి తొందర?

ఉద్ధృత వేగంతో తీరాన్ని తాకేలోగా
తరగి అరిగిన తరంగాల అడుగుల సవ్వడితో
మళ్ళీ వెనక్కి అంతే వేగంగా
కల్లోల ప్రశాంత జంత్ర గాత్ర సమ్మేళనంలోకి!

హఠాత్తుగా వెనువెంటనే తరిమే ఇంకో కెరటం
అదేఘోష, అదే తీరని ఆర్తి
అనునిత్యం అంధకారం లోంచి
జిగేలున చీల్చుకొచ్చే తీరని వాంఛా జ్వాలలో
ఆకాశానికి అవనికి తెగని అనుబంధం!

ఎవరు ఎవరికోసం నిరీక్షిస్తుంటారో
ఏచోట ఏమనసు విరిగి

అదృశ్య శకలాలుగా కనుమరుగై పోతుందో
ఎవరైనా చెప్పగలిగితే ఆనందమేది?
ఇంతకీ మనస్సాగర ఆవేశానుభవంలోని
నిర్విరామ అంతర్ ఘోష కర్థమేది?

* * *

## మెగా కల్చర్!

-నిఖిలేశ్వర్

''మాదగ్గరవున్నదంతా మాకోసమే
మాదగ్గరలేని దంతా మీజేబుల్లోంచి కాజేస్తాం!''
ఇదే సామ్రాజ్య దేశాల వ్యాపార జీవన సారం
లోలోన మనిషి వెన్నుపూసకు క్యాన్సరెక్కించి
ఎప్పుడో చొచ్చుకుపోయింది దేశదేశల్లోకి!

సొంత సుఖాన్ని మాత్రమే
పూజించే ప్రయివేటు నాగరికతకు
ఇప్పుడిక పరాయి దుఃఖమే సిగ్గులేని పెట్టుబడి,
పొరుగు వాణ్ణి కనీసం చిరునవ్వుతోనైనా చూడని
పక్కింటి ఆసామి నత్తగుల్లగా కుదించుకు పోతున్నాడు.

హైటెక్ సంతానమేమో
విమానాల డేగల మెగాకల్చర్ చూపులతో
భూమ్మీది ఆత్మీయతా వేళ్ళనే పెకలిస్తున్నది!
ఇటుకపై మరో రాబడి ఇటుక పేర్చుకోగానే

ఎలుకల పందెంలో వెనకపడగానే వోటమి ఏడ్పు
కిందా మీదా పడి కుమ్ముకునే దళారి ఎడ్లు ఎలుగ్గొడ్లు

బంగారు బాతుగుడ్లు పెట్టే రియల్ ఎస్టేట్ వ్యాపారాల్లో
నేరమయ చరిత్రనే జాతికి అంకితమిస్తున్న
నీతినియమాలను తార్చే రాజకీయ బ్రోకర్లు,
చదువులమ్మే దుకాణాల దిష్టిబొమ్మ డిగ్రీల్లో
శవాలపై నోట్లకట్ట లేరుకుంటున్న స్టార్ నర్సింగ్‌హోమ్‌లలో
సరళీకృతమనే ఆర్థిక విధానాల పెంటలపై పుడుతూ
పెరుగుతున్నారు కొత్త శతాబ్ది లబ్దిదారులు!

అందుకే ''ఏదేశమేగినా ఎందుకాలిడినా''
బహుళ జాతి సామ్రాజ్యదాహంతో వెసులుబాటు వివాహం
విదేశ స్వదేశ గుత్త సంస్థల ఒక రాత్రి దాంపత్యంలో
పుట్టుకొస్తున్న కంప్యూటర్ జీవుల అమానుష ధన వ్యామోహం!!

* * *

# ఓ అయిదు ఎపిసోడ్స్

-జూకంటి జగన్నాథం

### 1

కన్నెప్పులు కళ్ళను కబళించాయి

..............................

అన్ని రోజుల్లానే
ఆరోజు అందరికీ తెల్లారింది.
ఆ అరవై వేలమందికి
ఆదినం ఉదయం లేదు

సెప్టెంబరు ముప్పై రాత్రి
వాళ్ళ బ్రతుకులకు బిగించిన ఉరిత్రాడు
అప్పటి వరకూ అన్ని రోజుల మీంచి
'కోటి కొమ్మచ్చు' లాడుతున్న
కాలం మోకాళ్లకు మోచేతులకూ గాయాలు

ఎప్పటిలాగే కాక
ఆరోజు దినపత్రిక
శవాలను మోసుకెళ్ళే 'పాడె' లావుంది
ఎప్పటి లాగే ఆ రోజు
గోడమీది పిల్లి ఆకాశ వాణీ, దూరదర్శన్
మళ్ళీ వెయ్యిన్నొక్కసారి
నరో కుంజరో హతో హతః అంది
నరో కుంజరో హతో హతః అంది

..............................

చెప్పడం మాత్రం తేలిగ్గానే చెప్పొచ్చు
యుద్ధం చేయాల్సింది

చావో బ్రతుకో తేల్చుకోవాల్సింది రంగం మీదున్నవాళ్ళు

...........................

ఏ భాషలోనైనా
ఏ కాలంలోనైనా ఏదేశం లోనైనా
కవి అనేవాడు కళ్ళు మూసుకు వుండడు
బాధ ఎక్కడ వుంటుందో
అక్కడ వాలుతాడు
దుఃఖం ఎక్కడ గుండె పగులుతుందో
అక్కడ అక్షరమై ఓదార్చుతాడు
అన్యాయం ఎక్కడ ఒళ్ళు మరచి ప్రవర్తిస్తుందో
అక్కడ ఎద్దులను తోలే వార్‌కట్టై ఆగ్రహిస్తాడు.

## 2

తల్లి మరాట్వాడా భూదేవి
ఒక సర్దుబాటు
కేవలం ఒకే ఒక చిన్న కదలిక
ధ్వంసం.... ధ్వంసం
విధ్వంసం.... విధ్వంసం
కూలిన గోడల క్రింద
సహాయం కోసం భూ నభోంతరాళాలు దద్దరిల్లేలా వేసిన
ఆ ఆఖరి కేకను
ఏ రెక్టర్ స్కేలూ నమోదు చేయలేదు
మట్టి కింద కప్పుకు పోయిన
ఆ తల్లీ పిల్లల బతుకు పెనుగులాటను
ఏ కన్ను కెమెరా లైట్ టెలికాస్టు చేయలేదు

...........................

'ఆప్ లే సహర్ష స్వాగత్ కరీత్ ఆహే'
'మీకు సాదరంగా స్వాగతం చెపుతున్నాం'
ఎప్పుడూ లేంది
ఖిల్లారి ఊరివతల అలాగే నిలిచిన బోర్డు
ఇప్పుడు అందరి గుండెల్లో
చేయిపెట్టి మెలిత్రిప్పుతుంది

.........................

మూడు కాలాల్లో మనిషిని
సంరక్షించిన ఇళ్ళే వాళ్ల సమాధులయ్యాయి
తరతరాలుగా మనిషి జీవితాన్ని
తీర్చి దిద్దిన ఊర్లే శ్మశానాలయ్యాయి
చావు సరిహద్దుల్లోంచి నడిచొచ్చి...
రెండు రోజులైనా తిండిలేక
వాళ్ళు ఆకలి చూపులు చూస్తున్నారు
ఓ అరటి పండు ఇస్తేనే చిన్నబోయి
వర్షించే మేఘం అవుతున్నారు
మనకింత సజ్జ అంబలిని పోసి
మనకింత జొన్నరొట్టె ఉల్లిపాయనందించే చేతులు
ఇప్పుడు 'బీరిపోయి' చూస్తున్నాయి
ఆప్యాయంగా ఆలింగనం చేస్కొనే
కండ్లు ఇప్పుడు ఏడ్చి ఏడ్చి పచ్చి పుండ్లు అయ్యాయి.

**3**

'ఘరి దబ్లె మారున్ గెలా'
'ఇండ్లు కూలి చచ్చాం'
బీభత్సం ... బీభత్సం
విషాదం ..... విషాదం

బాధ యాభై ఆరు అక్షరాలకు అందడం లేదు
దుఃఖం ఏ మాటలకు లొంగడం లేదు
అప్పటివరకూ ప్రకటించిన
భయాందోళనల అర్జీని
ఏ అధికారమూ అమలు జరుపలేదు
మనల్ని గుండెల మీదెత్తుకొని 'సాది' సంరక్షించిన
పుడమి మృత్యువు కర్మాగారమైంది
ఊరు వాడ ఏకమై శిథిలమయ్యాక
ఇప్పుడు రాజ్యం
చచ్చిన లేక బతికిన జమాఖర్చులకు
క్రూరంగా సిద్ధం అవుతుంది.
..............................
శవం పైన పేలాలను ఏరుకొనే వ్యవస్థ ఇది
మనిషి నైనందుకు నాకు నేనే సిగ్గుతో కుమిలిపోతున్నాను
కవి నైనందుకు రాజ్యాన్ని తిడుతున్నాను

**4**

'కోనిపన్ సహకార్ కెలీ నై'
'ఎవరూ సహాయం చేయడం లేదు'
ఆగ్రహం అంతా అధికారం మీదే
బ్రతికున్నప్పుడు
అపాయాన్ని గుర్తించ నిరాకరించిన
దుర్మార్గమైన అధికారం
రాక్షసంగా అరవై వేల శవాల మీంచి నడిచొచ్చి
సహాయం చేతిని చిలుకరిస్తుంది.
'సగ్‌లే గేలే ఆమి ఏక్ చౌహ్యా'

'అందరూ పోయారు నేనొక్కణ్ణే మిగిలాను'
మనస్సు మచ్చుకు కనబడదు
బ్రతుకు రాజకీయమైంది
'ఓం' నుంచి 'చాంద్' నుంచీ 'శిలువ' నుంచి
నడిచొస్తున్న ప్రశ్న
దహనం వద్దో ఖననం వద్దో నిలిచిపోయినా బాగుండేది
ఇప్పుడు ప్రశ్న
చిగురిస్తున్న లేత హృదయాల కంఠాలకు
వ్రేలాడుతున్న సైనైడ్ మాత్ర అయ్యింది
.........................
ఆగ్రహం అంతా అధికారం మీదే
తేప తేపకు
అధికారం హెలీకాప్టర్ మీంచి
కన్నీళ్ళను బేరీజు వేస్తుంది
విసుక్కుంటూ సైన్యం దొంగ పోలీసులను తిడుతుంది
పోలీసు జాగిలాలు ప్రజలను కరుస్తాయి
ప్రజలు రాజకీయ నాయకులను ఆడిపోసుకుంటారు
ఎవడూ ఎవని తలమీద
బరువు వుంచుకోడు
అంతా 'చేపా చేపా ఎందుకు ఎండలేదు'....
జ్ఞాపకాలు తెరపై కదలాడి .... కదలాడి....
గుండెల్లోంచి తన్నుకు వచ్చే కన్నీళ్ళు
ఎప్పుడో ఆవిరైపొయ్యాయి...
అబద్ధం.... అబద్ధం
అంతా ....అంధత్వం....అవిశ్వాసం....
చెప్పేదొకటి చేసేదొకటి
రాజకీయం

ఇప్పుడు ఖిల్లారి, మంగ్రూర్, నకదుర్గా.
హరేగామ్, ఉమర్గామ్, శిథిలాల్లో
శవాలను తీయడం లేదు
సహాయాన్ని చేయడం లేదు
ఓట్లను ఏరుకుంటుంది
శవాలతో నష్టపరిహారం వ్రేలిముద్రలను వేయించుకుంటుంది.

**5**

మళ్ళీ యథావిధే
పత్రిక రేడియో దూరదర్శన్లూ
మరో తాజా వార్తా సంచలనంతో
ఆగమేఘాలపైనా
మళ్ళీ మన ముందుకు వాలుతాయి
భోపాల్నూ
భోఫోర్సునూ, డిసెంబర్ ఆరును
అలవోకగా మరచిన మనం
తలదించు కోవాల్సింది పోయి
'సే యస్ టు నర్మద' కుట్రలో
త్రోవా దారీ లేక కొట్టుకుపోతాం
అర్వై వేల శవాల ప్రమాణంగా
అతిమామూలుగా సర్వసాధారణంగా
సమస్యనుంచి తప్పుకుపోతాం.
ఛీ...ఛీ...
మన నరనరాల్లో
రక్తం ప్రవహించడం లేదు
థూ....థూ....
ఖాదీ టోపీ భూకంప ప్రకంపన

పునరావాసం 'బ్రోకరేజి'ని
భోంచేసి త్రేనుస్తుంది
సిగ్గు .... సిగ్గు
ప్రభుత్వం ఎప్పుడు బాధ్యతగా వ్యవహరించింది?
రోజు అప్పుడూ ఇప్పుడూ
ఎప్పుడూ ఒక దగుల్బాజీ, దళారీ
మూతిని ముందుకు చూపిన
కేశవ్ ముసలిగుంట నక్క
ఇంత జరిగినా నిశ్శబ్దంగా
పళ్ళెంలో పాయసం పోసి
కొంగను విందుకు ఆహ్వానిస్తుంది.
అజ్ఞానం అందామా అవమానకరం అనుకుందామా
చూపువుండీ
ప్రతిసారీ బ్రెయిలీ లిపిని ఆశ్రయిస్తుంటాం తడుముతుంటాం
అనుమానం అనుకుందామా? అవహేళన అనుకుందామా?
జవాబు తెలిసీ....
ప్రతిసారీ ప్రశ్నను పాచికలా సంధిస్తుంటాం.

షేమ్! షేమ్!!
చేజేతులా అప్పటివరకూ
ఒక్కటొక్కటిగా
సమస్త అవయవాల్ని కోల్పోయిన మనం
ఇప్పుడు గుదిబండలా భ్రమించి
తీరా 'గుండెను' ఖిల్లారి శిథిలాల్లో జారవిడుచుకుంటున్నాం!

**(1993 సెప్టెంబరు 30 రాత్రి మరాట్వాడా భూకంపంలో అసువులు బాసిన స్త్రీలకూ, పిల్లలకూ హృదయ విదారకంగా..)**

* * *

# దివ్యధార

– ఆసు రాజేంద్ర

నీ కోసం
అంతా వెదికాను.
ఎక్కడా కన్పించలేదు.
తీరా
నువ్వు నాలోనే ఉన్నావని
తెలుసుకోగానే
చిత్రం
ఇప్పుడంతటా నీవే కనిపిస్తున్నావు. 1

ఇహాన్ని
వదలి వచ్చాను
'తలుపు తెరు' అన్నాను
నీ ద్వారం తెరచుకున్న
అలికిడియే లేదు
నాలో మరుగుతున్న
అహం ఆవిరైంది
సర్వం వీడి
ఇపుడు నీ ముందు నగ్నంగా నిల్చున్నాను.
నీ దివ్య హస్తం
నన్ను పెనవేసింది. 2

నీ తలపుల్లో మునిగి
గుడ్డివాణ్ణైనాను

అందుకే
నాకు వెలుగుదారి దొరికింది. 3

నీ ఒడిని చేరితే
బండరాళ్ళు కూడా
బంతిపువ్వు లౌతాయి. 4

నీ చిన్నారి
కుటీరం ముందు
ఈ విశ్వమే వెలవెలబోతుంది సుమా! 5

నీ ప్రేమామృతాన్ని
పరులకు పంచకపోతే
ముమ్మాటికీ నేను స్వార్థపరుణ్ణే! 6

ఈ కట్టెలో
నే దాక్కున్నాను.
నాలో నువ్వు దాక్కున్నావు
నన్ను నేను కోల్పోగానే
నువ్వు యిట్టే దొరికిపోతావు. 7

నీ మౌనగానం విన్నప్పుడల్లా
నా పంజరంలో చిలుకకు
రెక్కలొస్తుంటాయి
దాని హద్దులు చెరిగిపోతుంటాయి. 8

నా చిటికెన వ్రేలు పట్టుకుని
నన్ను నడిపిస్తున్నప్పుడు

ముళ్ళ దారి కూడ పూలబాటే
గంజీనీళ్ళు కూడ
పంచభక్ష్య పరమాన్నాలే! 9

నీకై విడిచిన
ఒక్క కన్నీటి చుక్కకు
కోటి వజ్రాలైనా సరితూగవు. 10

కోరికల కంబళి కప్పుకున్నాకే తెలిసింది
దేహానికెన్ని కష్టాలో
అందుకే దాన్ని దూరంగా విసిరి
నీ ఒడిలో ప్రశాంతంగా నిద్రపోతున్నా... 11

నేను నీ శిఖరాన్ని
చేరాలంటే
నేను నా లోతుల్లో
మునగాల్సిందే
నీ ఊపిరిని పీల్చాల్సిందే! 12

చెట్లు చేమల్నీ
రాళ్ళు రప్పల్నీ
గడ్డాలూ విభూతుల్నీ దాటి వచ్చాను
ఇక ఈ ప్రశాంత వనంలో
అనుక్షణం పరిమళించేది నీ ఊపిరే కదా! 13

నవ్వడం, ఏడ్వడం కన్నా
ఎదలోయల్లో
మౌనాన్ని నాటడమే మిన్న. 14

కరుణ సముద్రంలో
ఈదే వాళ్ళెందరో
కానీ
తానే ఆ సముద్రంగా
ఉప్పొంగేది మాత్రం
ముమ్మాటికీ నువ్వే! 15

నా వాళ్ళ కోసం
అల్లుకున్న పట్టువస్త్రం
నా చితితోనే అంతమౌతుంది
కానీ!
నా కోసం అల్లుకున్న దివ్య వస్త్రం
దిగంతాల వరకూ నాకై పరచి వుంటుంది. 16

నీ హిమాగ్నిలో పడి
నేనో
సతి నౌతా. 17

నీ కోసం
ఏ శిఖరాలూ ఎక్కనక్కర లేదు
నిశ్చలంగా
నా ఎదలోయల్లో అన్వేషిస్తే చాలు
నీ చిరునామా దొరుకుతుంది. 18

హృదయాన్ని ఆభరణం చేసి
నన్ను నిరాడంబరుణ్ణి చేసావు
నీ ప్రేమ మందిరంలోకి దారి చూపి
నా సర్వం కూల్చావు.

అయినా యింతకన్నా
ఏం కోరుకుంటాడు
ఈ అచ్చమైన ప్రేమికుడు? 19

నా మది గదికి
కిటికీ లున్నాయి
తలుపులు లేని గుమ్మాలున్నాయి
ఇక నీదే ఆలస్యం. 20

నీ పిలుపు
నా మరణ శుభవార్తే అయితే
ఇదిగో ఇప్పుడే వచ్చేస్తా!
అయితే
ముందుగా నా చేయి నీవు అందుకోవాలి. 21

నేను
నా నీడను సయితం
నీ కిచ్చేశాను.
ఇంతకీ
నువ్వు నన్నేమని పిలుస్తావు? 22

నీ వెవరో
నే నెవరో అనుకున్నప్పుడు
హృదయం గులాబీ
ముళ్ళను కౌగిలించుకుంది.
నువ్వే నేనైనప్పుడు
ఆ హృదయమే
అదృశ్యమైంది. 23

నీ ఆలోచనల పొలీడు
నా తనువంతా అల్లి
నన్ను దిగంబరుణ్ణి చేసింది.
లోకం దృష్టిలో
నేను పిచ్చివాణ్ణైనా
నీ కళ్ళ కెపుడు పసివాణ్ణేగా... 24

అనుక్షణం
భ్రమల కత్తుల వంతెన
నన్నాహ్వానిస్తున్నా
నేను మాత్రం
నిరంతరం నీ స్మృతి సువాసనలో
ఈదుతూనే ఉన్నా. 25

పక్షి పాతదే
పంజరమే కొత్తది
తనను తెలుసుకోనంతవరకూ
తెంచుకోనంతవరకూ
పక్షికి తప్పదు
ఆ పంజరాల్లో బతుకు. 26

ఈ కనిపించే వెలుగులో
చీకటి ముసిరి వుంది
అందుకే
నీ అసలు వెలుగు కోసం
లోపలి కంటిని తెరచి
బయటి రెప్పలకు గడియ వేశాను. 27

నీ యిరుకు దారివెంట
'నేను' రాలేను
అందుకే నా హృదయాన్నే పంపుతున్నాను. 28

నీ అన్వేషణలో
అలసిపోయాను
నిరీక్షణతో
ఉపశమనం పొందుతున్నాను. 29

ఈ దాగుడు మూతలు ఎందుకు?
పూర్తిగా గుడ్డివాణ్ణి చెయ్యి
అప్పుడు
ఇంచక్కా నన్ను నడిపించేది నీవే కదా! 30

నా నదిలో
నే ఈదుతున్నా ...
నా స్వస్థలం చేరాలని 31

నీ కుటీరాన్ని
గడ్డి సరకగానైనా
అలరించాలని వుంది. 32

నీ చిరునవ్వుల పరిమళాలే
నా కష్ట సుఖాలు
అవే నా మార్గానికి దీప స్తంభాలు. 33

కుల మతాల
ఎరుకలేని మందిరం
నీ హృదయం
అందుకే అక్కడ
ప్రేమ వెల్లువై పొంగి పొరలుతుంది. 34

కూలిపోయే వృక్షం పై
వ్యామోహ మెందుకు?
రేపది కూలగానే
కట్టెల్లో కట్టై
చితిమంటల్లో చిక్కినప్పుడు
మిగిలేది గూడులేని పక్షేకదా! 35

నీ ప్రేమ నదిలో
మునకెయ్యగానే
నేను కాస్తా
తీరం దాటిపోతాను సుమా! 36

హృదయంతో పూజించే వానికి
ఇక ఆ పువ్వులెందుకు? 37

నీ కోసం అన్నీ తెరచి
హృదయాన్ని మాత్రం మూసుకున్న వాడికి
నీ వెలా కనిపిస్తావు చెప్పు?! 38

కష్టాల కార్చిచ్చులోంచి
సుఖాల పువ్వులేరుకునేవాడు
ధన్యుడు. 39

**(అంకితం: నా గురుదేవులు శ్రీ రామచంద్రా మహరాజ్‌కి.)**

# చిటికెలు

- భగ్వాన్

చిలక ఎగిరిపోయింది
పండు మీద గాయం
పాపాయి కన్నీటిని స్రవించింది. 1

చెట్టు చెరువులోకి దూకినా
పండు
గట్టునున్న కుర్రాడిదే. 2

వాళ్ళు చేలో వంగుని
రైతు కుండెలోని
కలుపు పీకేసారు. 3

ఈ బురదలోంచి ఆ బురదలోకి
ఓ కప్ప దూకింది
కుర్చీ బరువుగా మూలిగింది. 4

చినుకు రాలదు విత్తు మొలవదు
కాలం
రైతు కళ్ళల్లో బావురుమంది. 5

అకస్మాత్తు కర్ఫ్యూకి
ఆఫీసులో చిక్కుకున్నవాడు
ఇంటి వద్ద భార్య గుండెలో తేలాడు. 6

ఎండు పుల్ల నోట కరచి
ఎగురుతున్న పక్షి
రేపే ఇల్లు మారాలి. 7

ఇంట్లో
పెళ్ళి సందడి
రేడియోలో సన్నాయి కచేరి. 8

నడి కప్పు మీద
గంతు లేస్తోంది కోతి
మనసుని అదుపులో పెట్టాలి. 9

నింగిలోనే కాదు
బీరువాలోనూ చందమామ
ఇల్లంతా వెన్నెల గాథలు. 10

పిల్లలు పడుకున్నాక
ఆమె నవ్వింది
గది ఓ సౌందర్య ప్రపంచం. 11

కటిక చీకటి
అయినా చేతులకు తెలుసు
ఎక్కడేముందో. 12

జ్వరం
మేనికా మనసుకా
ఆమె కనిపిస్తే తేలిపోతుంది. 13

మామూలు వర్షమే
అయితేనేం
ఓ విత్తు మొలిచింది. 14

ఖాళీ పెట్టె
తెరచి చూస్తే
నిండా నేనే! 15

పరీక్ష హాలు
కలం ఎంత కదిలినా
కాలం కదలదు. 16

తీరం నుంచి
పడవను చూస్తే
తీరం చేరువులోనే ఉంది. 17

* * *

# నిరంతర సమాంతరాలు

-ఎన్. శైలజ

పగలు తెల్ల కలువ రేకుల్లా
సూర్యుని పై ముడుచుకొంటూ
చీకటిని ఆకాశానికి మిగిల్చేవేళ
సంధ్య కురిసిన రంగుల మడుగుల్లో
కాళ్ళూపుతూ కబుర్లు చెప్పుకొందామంటే,...
టేబుల్ మీద
గంటల ప్రకారం రాసుకున్న
'ఈ రోజు పన్లు' లిస్టులో
ఈ పనిలేదే .. అనుకుని
కాఫీ కప్పు పొగల్లో
మేఘాల్ని ఊహించుకొందాం అంటావు నువ్వు.

రాత్రి నైట్‌క్వీన్ పూల వాసన
సెర్చ్ లైట్‌లా
మనల్ని వెతుకుతున్న వేళ,...

వెన్నెల,
సరుగుడు తోట నేలపై
ప్రేమ లిపికోసం
అక్షరాలు రచిస్తున్న వేళ,...
విచ్చిన బ్రహ్మజెముడు పూలల్లోంచి
పుప్పొడి క్షణాల్లా
ఎగురుతున్న సమయాన...,
'కలల్ని
కలబోసుకుందాం' అన్నాను నేను
గడియారం ఇరుసు మీద నిలిచి
ఏ ముల్లు మీద నడిచి
ఏ నిమిషం లోంచి
బయటకు దూకాలో
తెలియని క్షణంలా కరుగుతుంటావు నువ్వు.

మాఘమాసం చలిలో
నక్షత్రాలు మంచు చుక్కలై
మండుతున్న బంతిపూలమీద
చలి కాచుకొనే వేళ...,
కాలుతున్న కందికాయల్ని ఊదుకొంటూ,
ఊసుల ఉయ్యాల
ఊగచ్చునుకుంటే.,
తిరుగుతున్న క్యాలెండర్ పై,
మారుతున్న షేర్ మార్కెట్ వైకుంఠ పాళీలో
పాము, నిచ్చెన్ల మధ్య
అయోమయంగా
తిరుగుతుంటావు నువ్వు.

రాలుతున్న పారిజాతాల మీద
కరుగుతున్న నిమిషాల్ని
కర్పూర దీపాలుగా వెలిగించి,
ఎదురు చూపుల దారుల్లో
వదులు తుంటాను నేను...,
భౌతిక ప్రయోజనాల
మెర్క్యురీ దీపాల దారుల్లో
బైర్లు కమ్మిన నిమిషంలా
నిలిచిపోతావు నువ్వు.

ఈ సమాంతర కక్ష్యల్లో పడి
సతమతమౌతున్న మనం
ఏ దారి తప్పిన తోక చుక్క మీదో
కలుసుకోగలం...,
ఏ కాంతి సంవత్సర పథంలోనో
సమయాల తేడాల్ని
సరిచేసుకోగలం.

* * *

# ఇవ్వాళ నా దేశం

-ద్వా. నా. శాస్త్రి

నా దేశానికి కాళ్ళూ చేతులూ లేవు
ఇవ్వాళ నాదేశాన్ని చూస్తుంటే
ఓజోన్ పొరలేని నేలతల్లి గుర్తుకు వస్తోంది
కబేళాకి వెళ్తున్న
అమాయిక గొర్రె పిల్ల గుర్తుకు వస్తుంది.
దేశ జనాభా పెరిగిందంటే నేనొప్పుకోను
పరాన్న జీవుల జనాభా పెరిగింది
పదవీ వ్యాపారపు డీలర్లు పెరిగారు

ఇప్పుడు -
దేశమంటే మనుషులు కారు
దేశమంటే మతం
దేశమంటే 'తినడం'.
దేశమంటే 'గ్యాట్' ఒప్పందం
ఇవ్వాళ నాదేశం
విదేశీయులకి ఓ స్విమ్మింగ్ పూల్
ఓ ఈడెన్ గార్డెన్.

పురూలియాలో
ఎవరో ఆయుధాలు జారవిడిచారని
కొత్తగా దిగులెందుకు?
మనం జారవిడుచుకోంది ఏముంది?
ఇప్పుడు దేశ భద్రత ముఖ్యం కాదుగదా!
ఎన్నాళ్ళు పదవినయ్యానన్నది ముఖ్యం
ఎన్ని స్కాముల్ని నడిపానన్నది ముఖ్యం.

అందుకే
ఇవాళ నాదేశం
రేకులు రాలిపోతున్న గులాబి
వైరస్ సోకిన రొయ్యల చెరువు
ఇవాళ నా దేశాన్ని పాలించడమంటే
అవకాశవాద పరిగలు ఏరుకోవడం
కలాల్ని, హలాల్ని చీల్చడం
స్వేచ్ఛాగళాల్లో ఆర్డినెన్సుల గరళం పొయ్యడం
ఇవ్వాళ నా దేశం
ఒక వికలాంగిని!

* * *

## 'మా దేశాన్ని హైజాక్ చేశారు'

-తక్కోలు మాచిరెడ్డి

'మా దేశాన్ని హైజాక్ చేశారు'
అని అంటోంది దారియా మితీన
రష్యా యువ కమ్యూనిస్టు లీగ్ కార్యదర్శి
నేరస్థులు నేతలైన చోట
మాఫియాలే పెత్తనం చేసేచోట
ప్రజల ప్రభుత లేని చోట
ప్రసార సాధనాలు అమెరికా వాణియై అలరారే చోట
మార్కెట్ సరుకులన్నీ విదేశీయమైన చోట
ఒకనాటి సవేత్ మహిళ

ఈనాడు అమ్ముడు సరుకై సలసలా కాగేచోట
అక్కడి నుంచి వచ్చింది
దారియా మితీన, కేరళ వచ్చింది.
సామ్యవాదం మా లక్ష్యం కాదంది.

''మాది ఇపుడొక వలస
మాకు కావల్సింది స్వాతంత్ర్యం
మేం కోరేది ఏక పార్టీ ప్రభుత కాదు
బహుళ పార్టీ ప్రజాస్వామ్యం
మేం కోరేది ఒక్కటే
ప్రజాస్వామ్యం, ప్రజాస్వామ్యం''.
ఆమె మాట్లాడినంత సేపూ
ఆమె కళ్ళల్లో
కాలిపోయిన పక్షి పునర్జన్మించినట్లుంది.

**(17-8-96 నాటి 'హిందూ' లోని వార్త చూసి)**

# మినీ రమణీయం

**-యస్. మునిసుందరం**

కొబ్బరాకుల సందు సూదుల్లోంచి
దోబూచులాడుతూ ఉష.
నేల పిల్ల తనువంతా
సిగ్గు సిందూరమై. 1

సంధ్య డ్యూటీ దిగుతూ
రజని కప్పగించింది రేరాజును
అప్పటికీ ఆ మాయగాడు
చుక్కల వలలో చిక్కిపోయాడు. 2

చినుకులు చినుకులుగా
భువిని తడిపేస్తున్న వెన్నెల
తాగిన మైకంలో
తలలాడిస్తున్న గడ్డిపూలు. 3

వెన్నెల కక్కుకుంటూ
తొక్కిసలాటలో హంసల దండు
వెండి కొమ్ముల్తో తీరాన్ని కుమ్ముతూ
పున్నమి సముద్రం. 4

చెట్టు కొమ్మపై కోకిలమ్మ
మా యింట్లో పాలబొమ్మ
ఇద్దరు మంగేష్కర్లు
ఇల్లంతా తేనెవాగై. 5

ఆకాశం పురుషుడి వలపు
వానై ముద్దులు కురిపిస్తే
పచ్చటి ప్రకృతిని
నీళ్ళాడేసింది పడుచు పుడమి. 6

మరకతాల కంబళి
కనుచూపు మేర.
కోనసీమ సోయగం
నా కన్నుల్లో శరత్ కేళి. 7

* * *

# జారిన సంధ్య

-యశశ్రీ రంగనాయకి

## 1

ఉంగా ఉంగా ఊసులు చెబుతూ
అమ్మ ఊయల్లో ఊగేటప్పుడు
ముద్దొచ్చి
'సొదు' సూర్యుడు
నా నుదురును ముద్దాడాడు.
నడకల్లోకి నేనొచ్చాక
జ్ఞాన నేత్రంలా
ఉదయభానుడై ఉదయించాడు.
అతడు
నా నేస్తమైంది మొదలు
ఎదురొచ్చిన మహాలక్ష్మి
పేరంటానికి పెద్ద ముత్తైదు
అపర ఈశ్వరి అన్నపూర్ణ
బిరుదల దండలు
నిలువెల్లా నన్నుక్కిరి బిక్కిరి చేశాయి.
అమ్మాయిల రామచిలుకలు
దీవనలకై
వాకిట్లో వచ్చి వాలేవి.
ఆ
నిగారింపులూ - నవ్వులూ
బిరుదుల దండలూ,
కాలంతో కవాతుచేస్తూ

రహస్యంగా
అతడినుండి నన్ను వెనుకకు నెట్టేసి
మనిషెత్తు మూటగా
పొందలేని సింధూరపు సిరిలా
దక్షిణం దిక్కులో పూడ్చిపెట్టబడ్డాయి.
ఇప్పుడు
నేనొక
చీదరించబడ్డ చీకటిని
వైరాగ్యం దుప్పటి కప్పుకున్న విరాగినిని
గోడమూలగా - గడ్డకట్టిన మౌనంలా,
సావిట్లో పాతబడ్డ గుంజలా,
సేదదీర్చే సిద్ధార్థుడు లేక
శోకించే శ్వేత మరాళంలా...

**2**

కాలం దారి
కంటి చూపుకు చిక్కనంటుంది.
నా ఒడి వాలు కుర్చీలో
విలాసంగా ఊగే మనవరాలిప్పుడు
తాత తలపుల పూలను
దండచేసిస్తే దాచుకుంటానని
గతం సెగలో కరిగిన నా కథలు వినాలని కోరితే
విన్న వసంతం
తడిమే తడికళ్ళతో
దొర్లుకుంటూ వచ్చి నాదరి చేరింది.
నా ఎదపైన పడుతున్న

కన్నీటి ముత్యాల్లో
మనవరాలి బొట్టు మెరిసి
మనువురాతను
మనవరాలి తరానికైనా మార్చవా...,
అని వేడుకుంటూ
సెలవు తీసుకుంది సిందూరపు సంధ్య. (22-8-1994)

* * *

# దాంపత్యం

-సరోజినీ ప్రేమ్‌చంద్

బ్రేక్‌ఫాస్ట్ సమయాన
మనసు వెన్నలో
మాటల కత్తుల కోత
వెలుతురు వేళ
నిర్లక్ష్యపు
నీలి తెరల మూత
సంధ్యారాగ
గీతాలకు
నిశ్శబ్దపు ఏకాంతత
నక్షత్ర సౌందర్యం
వీక్షించే కాంక్షేలేక
చల్లని కౌగిలిలో
గుండెల మృదంగ రోదన
మరపింత

మళ్ళీ మరో ఉదయంలో
ఆమెకి
వంటింట్లో
గిన్నెలతో స్నేహం
అతనికి ఆఫీసులో
పదవుల నిచ్చెన మెట్లపై
వ్యామోహం!

* * *

## కిటికీ

-మారుతీ శ్రీలత

ఊహలకు రెక్కలనిచ్చి!
ఉవ్విళ్ళూరే కోరికలకు అడ్డుగ నిల్చిన ఊహలతో
గడిచిన రాత్రి జ్ఞాపకాలతో
గడవని ఘడియల తొందరపాటులు
నిశ్శబ్దం తోడయిన వేళ
నాకు తోడవుతుంది.
విచ్చల విడిగా సాగే ఆలోచనలకు
మదిలో భావాల అల్లరులకు
తానే సాక్ష్యమని
చెప్పకనే చెబుతుంది.
బంధనాల సంకెళ్ళు త్రెంచుకొని
సాగిపోయే ఆవేశానికి
ఆలోచన చేయమంటుంది.
ఒక్క క్షణం ఆగమంటుంది
ఆకాశంలో నక్షత్రాల, సూర్య చంద్రుల

ఆగమనాన్ని
సృష్టిలోని చైతన్యాన్ని సృజింపజేస్తుంది.
మనసు మౌనం పూనిన వేళ
నాకో నెచ్చలి అవుతుంది.
అమ్మ వడి వీడి
అనంత పయనం సాగి వచ్చిన వేళ
నిదురరాని కన్నులతో అలసిన వేళ
అమ్మ జోలపాటను
అమ్మ మృదువైన మాటలను
చిరుగాలులలో మోసుకొస్తుంది.
మూతపడని కనురెప్పలపై
తీయని అనుభూతినిస్తుంది పైరగాలిని దెచ్చి
వెన్నెల విరిపాన్పును నా గదికి మోసుకొస్తుంది.
నీలి మబ్బులను నాకు దుప్పటిగా నిచ్చి
విరజాజుల పరిమళాలను
నా మదికి తాకిస్తుంది.
నిరాశలే మిగిలిన వేళ
నా నేస్తమయి తన హృదయపు తలుపు తెరచి
నన్ను ఆహ్వానిస్తుంది.
ప్రపంచాన్ని మనసు పెట్టి చూడమంటుంది.
గుండెలోని భావాలను గుప్పిటిలో దాచక
మనసులను కదిలించే కెరటమయి
నన్ను ఎగిసి పడమంటుంది।
మనిషి అనుభవాలను
దాచిన చిరు జ్ఞాపకాలను తనతో
పంచుకోమంటుంది.

* * *

# మౌన రాగం

-'మౌని'

ప్రేయసీ!
నువ్వు ... శుక్రవారం తొలి ప్రొద్దులో
అప్పుడే విరిసిన ముద్దబంతి పువ్వులా
విచ్చుకుంటున్నప్పుడు
నాలో ... ఎక్కడో
మొగలి పూరేకు గుచ్చుకుంటున్న శబ్దం
నా నవ నాడుల్లో
విద్యుత్ ప్రకంపనం...

ఏకాంతంలో
వెచ్చగా...నులివెచ్చని నీళ్ళలో
అనాచ్ఛాదితగా
విజృంభించి
తలస్నానం చేస్తూ...
కూనిరాగాలతో... కోయిలను
మరపిస్తున్నప్పుడు
నాలో ఎక్కడో
గుప్పుమంటున్న 'కునేగా' పరిమళం
నా గుండె లోతుల్లో
ఒక మౌనరాగం.

అందాలు దాగిన
అద్భుత కోణాల్లో
పసిడి మేనిపై పచ్చగా
పసుపును పండించాలని

నీ అరచేతి వ్రేళ్ళు .. నీలో నాట్యం చేస్తూ
స్పృశిస్తున్నప్పుడు
నాలో ... ఎక్కడో
యౌవనం ఎక్కుపెట్టిన
వింత దృశ్యం.

ఇక నా జీవితం... నీకు దాసోహం
నా సర్వస్వం ... నీకు అర్పితం.

* * *

# మూడు కవితలు

-పాతమత్తిగిరి సుబ్రహ్మణ్యం

## 1 'క్రీడాభిరామం'

మరుహజారంలో జరిగిన మకుటాభిషేకంతో
తరతరాల మగదర్పంతో అతడు
పితృస్వామ్య వ్యవస్థను కూలదోయాలన్న
దృఢ సంకల్పంతో
లయకాల కాలాభ్రంలా గర్జిస్తూ ఆమె
కానీ
ఋతు చంక్రమణంలో
మకరాంకు శాంభరీ మహిమతో
లింగభేదపు ఉపసరంలో
సముద్రుడి బాహువుల్లో ఒదిగిపోవడానికి
దూకలిస్తూ వచ్చిన సరిజ్ఝురంలా

మల్లెల, మందారాల మీద వాలడానికి వచ్చిన
మత్త మధుపంలా
మోహనవంటి మొగసాలలో
ఆలోలమైన చిత్తవిభ్రమంతో ఆసురిలాగా ఆమె
చిమ్మరేగిన కుతుకంతో ఆంబోతులా అతడు
నిసర్గం తెచ్చిపెట్టిన నిస్సిగ్గుతో
అతడికి తన ఆకృతిని ఆమెత పెట్టాలనే
బైసిమాలినతనం ఆమెలో
నిర్లజ్జలో, నిస్సంకోచంతో బుగులు కొనిన
బుభుక్ష అతడిలో
గాలి నిప్పుతో గెడబెరసినట్టుగా
ఆ తప్త ఆలింగనాల్లో రగులు కొన్న వలపు దవ దహనం
వీగిన విద్వేషాలు
పటాపంచలైన పట్టుదలలు
మలిగిపోయిన చిలిపి జగడాలు
ఆ నిర్దయ గాఢ పరిష్వంగంలో
ఊయల లూగిన యుగయుగాల మోహ పరవశత్వం
భావ లాభ లాఘవపు క్రేంకారాలు
గ్రామ్యసుఖాంత ఘర్మసలిల సేచనంతో
మన్మథ విజిత మందాక్షం.

## 2 నీ చేయి ఆసరాతో.....!

అరుదెంచిన ఆమనికి సంకేతంగా
భూదేవి హరితానందంతో పులకించే వేళ
ప్రకృతి కన్య శింజాన మంజు మంజీర నినదం
కవులను విస్మయ పరిచేవేళ

విశ్వ విపంచిక తీగలు మీటుతూ
ఆమె కరాంగళులు పలికించే
సుభగ స్వర జాతుల విమల గాంధర్వంలా
కోయిలల అవ్యక్తమధుర ధ్వనులు
చెవులకు పండుగ చేసే వేళ
నేస్తం!
నీ నీలికురుల సమాకర్షి పరిమళపు అగూఢ గంధం
నన్ను చుట్టు ముట్టిన వేళ
ఆగామి శతాబ్దానికి స్వాగతం పలుకుతూ
నానా సూన వితానపు జడివానలో తడుస్తూ
విమతం మన మధ్య దించిన జవనికను జార్చి
మనసు విప్పి మాట్లాడుకుందాం
రా నేస్తం!
సమత కోసం సరికొత్త వ్యూహం రచిద్దాం
ఎంతో అర్మిలితో, పరస్పరావగాహనతో
పరిష్కరించుకోవలసిన మన ఇరువురి సమస్యల కోసం
మనమిలా పోట్లాడుకోవడ మెందుకు?
నీలో ఈ చిత్త తోషణం ఎందుకు?
నాలో ఈ చిత్త విక్షోభం ఎందుకు?
నీ మదన దర్పణ తుల్య కపోలం
నీ కంటి చక్షూరాగం- నీలోని విహ్వలత, విహ్వాతం
నా ఆసరా లేందే నీవు అడుగు ముందుకు వెయ్యలేవని
చెప్పక చెబుతున్నది.
విశ్వమంతా హింసాచారాలు, దోపిడీలు, దౌర్జన్యాలు
రావణకాష్ఠంలా రాజుకుంటున్న వేళ
సాముహిక హత్యలతో సర్పయాగాలతో
సంఘ విద్రోహులు వికటాట్టహాసం చేస్తున్న వేళ
మానవ శోణిత ధారలతో మహార్ణవాలు

ఎర్రబడుతున్న వేళ
నన్నొంటరి వాణ్ణి చేసి నీ చుట్టూ గెఱ గీచుకుంటున్నావా!
ఒద్దు నేస్తం - వొద్దు
ఆపదల్లో, ఆజి రంగాల్లో
ఆదిశివుడికి ఆదిశక్తి అందించిన చేయిలా
ఆదివిష్ణువుకు ఆదిలక్ష్మి అందించిన చేయిలా
సౌందర్య పరమాత్మకు రతీదేవి అందించిన చేయిలా
నీ చేయి ఆసరా నాకు వెయ్యేనుగుల బలం ఇస్తుంది
నీ అస్తిత్వ నిరూపణ కోసం
అతిసాంద్ర కవిత్వమో, నీలి కవిత్వమో మరేదో
వ్రాసుకు కూర్చునే కాలం కాదిది
నీ వ్యక్తివాదం మనిద్దరికీ, ఈ సృష్టికీ
ఎంత అపాయమో ఊహించావా!
నిబద్ధత లేని నిఖార్సుతనంతో
మన ఆలోచనలు అన్ని యిజాలకూ అతీతం కావాలి
అంతరించి పోతున్న ఈ మానవ జాతిని ఆదుకోవాలి
ఈ హత్యాకాండల్నీ, ఈ దమన నీతుల్నీ, ఈ అసమానతల్నీ
ఈ ఆకలి చావుల్నీ
మనం వెంటనే ఆపాలి
మన ఉద్యమం సామూహికం కావాలి
మన ధ్యేయం విశ్వశాంతి స్థాపన కావాలి
అందుకై నీ చేయి ఆసరా నాకు కావాలి.

* * *

## 3 'మహాభి నిష్క్రమణం'

రాత్రి!
తమి నిండిన నీ గొంతులోని పావురాల ఆరజం
వింటున్నప్పుడు నీ దేహమే నాకు బోధి వృక్షమయింది
అందుకే
ఈ సముదయ నిశాంతంలో
ఈ అనఘవేళ
అచ్యుతమూ, అజరమూ అయిన బ్రతుకు వైపుకి
నే నారంభించిన ప్రయాణానికి అడ్డుకట్టవేయకు
హిమానీ కురిసే ఈ ప్రత్యూషంలో
బాల సమీరం చేసే మధురధ్వని
నీ కళ్ళల్లోని కుసుంభ రాగం
వార్షుకాభ్రమవుతున్న నీ ముఖ వికచారవిందం
చూస్తూ వుంటే మళ్ళీ నా గుండెల్లో
వలపు గాధ నాళీకం గుచ్చుకునే ప్రమాదముంది
అందుకే ఇక ఆగుదామా
మాటల్లోనే మనం భవవనం అంచుల్ని చేరుకున్నాం
నీ కన్నీళ్ళు, నీ వేడుకోలు ఆపుతావా?
నన్నొదిలి పెడతావా?
ఈ బ్రతుకు ప్రహేళికను విప్పి చెప్పిన
నా విచార ధార నీ తలకెక్కనప్పుడు
చలం, వీరేశ లింగం లాంటి వాళ్ళు
లక్షలమంది పుట్టుకొచ్చినా నిన్ను మార్చలేరు.
నీ కంటి కాటుక చిమ్మ చీకట్లనుండి
వెలుగువైపుకి నన్నొదులుతావా?
ఈ దేశం లోని గుళ్ళూ, గోపురాల్నీ
సంప్రదాయాల్నీ, ఐతిహ్యాన్నీ

నువ్వు వ్రతాలు ఆచరించేందుకు
నోములు నోచేందుకు
నీ సవాలక్ష దేవతల్నీ, దేవుళ్లనూ
నీ ఐదోతనపు నిశానీలైన
పసుపు కుంకుమల్నీ, గాజుల్నీ, పువ్వుల్నీ
అన్నింటినీ నీకే వదలి వెళుతున్నాను.
ఇంకా ఏడుపెందుకు? నన్నొదిలుతావా?

* * *

రాయంచ ఠీవిని ౯
శుభ్ర గంభీర రాజస
నీలో పుట్టిన ఓంక
రింగులు రింగులుగా
గుండె గుహలో నిం
ఆత్మ వృత్తపు కేంద్ర
పయనమయ్యే నీ
నిశ్చల సమాధిలో
నీ స్వరపరాగాల ప
మత్తెక్కి; నిషాతో న
అనేకానేక రసాత్మల
ఆరాధ్య దైవానివి నీ

నీ ప్రతిభ పరిఢవిల్లి
నీ రూపం మూర్ధన్య ...లచింది ఈ జమానాలో-
సంగీతాకాశంలో రేరాజువై
గానకళా సామ్రాజ్యాన 'యశరాజు' వై
విలిసిల్లి గాత్రసుధను విరజిమ్మిన నువ్వు
అవిస్మరణీయునివి,
చిరస్మరణీయునివి.

ులు ఎన్నెన్నో!

మంచు మైదానాల ఆచ్ఛాదనల్ని
స్పర్శించి తపించే ఎడారుల మీద
తియ్యని కలల పంటై వర్షిస్తుంది నీ గాన మధువు

సుప్త జీవన చైతన్యాంకురాల్ని
ఉత్తేజకర రాగ ధారల్లో తడిపి
పుష్పింప జేసే నీ ప్రతిభ అమేయం.

## 10. ఉస్తాద్ జాకీర్ హుస్సేన్

ప్రమథ గణాల డమరు ధ్వానాలకు
జవనాశ్వాల పదఘట్టనల్ని జత చేసి
కల్లోల జలధుల ఉత్తుంగ తరంగ ఘోషతో కలబోసి

కరాంగుళుల్లో నిక్షింప్తం చేసుకున్న యువ ఉస్తాద్!
పెళిల్లుమని భువికి రాలే పిడుగుల మ్రోతలను
మేఘ గర్జనల్తో మేళవించి
రణన్నినాదాన్ని రవళింప జేస్తావు.

ఒక సుమ దళం రాలిన చప్పుడు
ఒక పూబాల గుండె కొట్టుకున్న శబ్దం
ఒక మృదు సమీరం హృదయాన్ని ఒరుసుకు పోయిన సవ్వడి
ఒదిగి వుంటాయి నీ వాదనంలో.

తండ్రిని మించిన తనయుడివై
వినయ విధేయతల పెన్నిధివై
సమకాలీన తబలా వాద్య సంగీత మకుటంలో
కాంతులీనే కలికి తురాయివై
వెలుగొందే మహావాద్యకా!
వెల కట్ట లేనిది సుమా నీ వాదనా నైపుణ్యం!

## 11. పండిత్ శివకుమార్ శర్మ

వాలు దొంతరల కొండ గట్ల మీద
చెంగు చెంగున గెంతుతూ పరవళ్ళు తొక్కి పారే
సెలయేటి గమనాన్ని తలపింప జేస్తూ
చల్ల చల్లని నిప్పు కణికల,
మంచు ముత్యాల, మధుర రాగాల
వర్షానుభూతిని కలిగింప జేస్తూ,
సన్నని నిట్టూర్పును అతికించుకుని

శబ్ద నిశ్శబ్దాల మధ్య సరిహద్దు రేఖలా వెలసిన
అతి తేలికైన సురభిళాన్విత నిశ్వాసాన్ని
సంతూర్ తీగల మీద
అలవోకగా ప్రవహింప జేస్తూ
హృదయాన్ని ఓలలాడిస్తూ...

'కాశ్మీర' హిమవన్నగ కోటీర దివ్యకాంతి బిందు వై
కన్యాకుమారి దాకా పారిన సంగీత స్రోతస్విని య్యై
అలరిస్తాడు,
అలరారుతాడు

## 12. బేగం పర్వీన్ సుల్తానా

అతి సన్నని పికస్వనాన్ని
అమృత ధారగా జాలు వారించి
అత్యున్నత గిరిశృంగాలనంటే అనుభూతిని
అంతరంగంలో అపురూపంగా గడ్డ కట్టించి
వెలకట్టలేని వెలుగుల జిలుగుల గానాన్ని
వెలయింప జేసే మధుర గాయని!

ఆమె గొంతులో పుట్టే గాన విద్యుత్తు
శ్రోతుల ఎదల్లో
చేతనా తటిల్లతల్ని మెరపింప జేస్తుంది
అకస్మాత్తుగా స్వరాన్ని ఆకాశానికి రువ్వి
అంతలోనే దాన్ని నేల మీదకి రాల్చే
అమేయ ప్రతిభా సంపన్నురాలు!

ఏ ఘరానా ముద్రనెరుగని ఆ గానాన్ని
ఎంత విన్నా తనివి తీరదు
ఎన్నేళ్ళు పై బడ్డా ఆ గొంతు
నవనవోన్మేషణత్వాన్ని వీడదు
అమర గాయని అమృత దాయిని బేగం పర్వీన్ సుల్తానా
అందరి ఎదల్లోనూ అపురూపంగా నిలిచే
బేగం పర్వీన్ సుల్తానా.

## 13. ప్రభా అత్రే

మెత్తని మేలిమి బంగారాన్ని సన్న సన్నని తీగెలుగా
లాగి సాగ దీస్తోందొక తియ్యని కంఠం!
ప్రభా అత్రే గాత్ర ప్రవాహం
స్పీకర్ల తూముల్లోంచి పెల్లుబికి వెల్లు వై
పరిసరాల్ని రసప్లావితం చేస్తోంది
ముందుకూ వెనుకకూ ఊగిసలాడే
మందపవనాల మీద
సన్న జాజులు డోలలూగినట్టు
ఉన్మత్త స్వరావళి ....
వివిధ చలనాల విన్యాసాలతో
'తనామన ధన తో పె వారు'

చెరకు గడల్లో చిప్పిల్లే తియ్యదనాన్నీ
మీగడ తరకల్లో దాగిన కమ్మదనాన్నీ
ప్రసాదించే రసాధి దేవతకు
ప్రణమిల్లాలనిపిస్తోంది. (సమాప్తం)

# హేమ భావిని

- నల్లూరి హేమకుమారి

## 1 దుష్టనాయకుడు

మాటి మాటికీ
తలూపుతుంది తొండ
అందరికీ
సలాము చేస్తున్నట్లు
కాని
ఎవ్వరికీ కానరాకుండా
తన ముళ్ళ పళ్ళతో
కొరికేస్తుంది
పచ్చని మొక్కల మొదళ్ళు !

## 2 అవి నీతి వృక్షం

చెట్టను కూల్చాలంటే
వేళ్ళు నరకాలన్న సిద్ధాంతం
ఇక్కడ కుదరదు
దీనికి వేళ్ళు లేవు
ఎక్కడ ఎన్ని సార్లు నరికినా
మరందుకే
ఇది నశించదు!

## 3 మేఘాలు

ఆకాశంలో
విరగ పండించిన
ప్రత్తి రైతు ఎవరు?
బస్తాల కెత్తకుండా
ఎన్నాళ్ళిలా
కళ్ళంలో ఆరబెడతాడు?

## 4 నెల పొడుపు

నేనే కనుక
ఆకాశరాజు
కమతంలో ఉంటే,
ఊడిపోయిన
జాబిల్లి కొడవలి పిడి
వడ్రంగి చేత
నిమిషాల్లో
వేయించి తేపోదునా ?

## 5 అర్ధ చంద్రుడు

ఆకాశదేవి
నిండుగా కట్టుకున్న
ఆ లేతనీలపుచీర
దేనికి
కొంగ్రుపట్టిందో కానీ,

ఆ చిరుగులోంచి
కనపడబట్టి కానీ
లేదంటే
ఆమె వంటి రంగు
బంగారు ఛాయని
నాకేంతెలుసు ?

(సశేషం)

# విశిష్ట హైకూలు

- ఆరుద్ర

**1**

సంకల్పం
సాయుధ మైతే
అరణ్యమే శరణ్యం.

**2**

అద్దం ముందు
రైటిస్ట్
అద్దంలో లెఫ్టిస్ట్

**3**

హైకూ
రసాస్వాదనకు
ఐక్యూ కావాలా?

**4**

వామనుడు
మూడు పాదాలడిగాడు
హైకూలు కూడా అంతే!

(అస్వస్థులై ఉన్న ఆరుద్రగారు మంచంమీద పడుకుని చెపుతుంటే డా. యస్. బషీర్‌గారు లేఖకుడుగా వ్యవహరించారు. 16, జూన్, 1996)

తెలుగు హైకూలు

# చుక్కలు

-స్కంద
(గూ.హి.మ.కుమారస్వామి)

1
రవి ఆడే
రంగుల బొంగరం
ఈ విశ్వం.

2
రవికిరణాలు
గిలిగింత లిడగా
మొగ్గ నవ్వింది.

3
కుల మతాలు
మన్ను చేరి
మిన్న కున్నాయి.

4
పుస్తకాలు గూటికి
పిల్లలు వీథి లోకి
బడి వదలితే....

5
నేనొక శిల
కష్ట - నష్టాలు
ఉలి - సుత్తెలు.

6
తలపుల కంచెకు
ఆరవేసిన వస్త్రం
వృద్ధాప్యం .

7
గోడ గడియారం
జోల పాడగా
నిశాశిశువు నిద్రించింది.

8
విశ్వమొక వృత్తం
రైతు కేంద్ర బిందువు
అందరూ వ్యాసార్ధాలు.

9

ఒళ్ళంతా కళ్ళుకో
అమవస నిసిలో నింగి
నేల నారిని చూస్తోంది.

10

చిక్కు ముడులను విప్పుతూ
విసుగు లేని వృద్ధాప్యం
తిష్ఠ వేసింది.

11

బస్సు ఆగింది
మనస్సు మాత్రం
అలాగే సాగింది.

12

నా చేతిలో రాళ్ళు
చెట్టు చేతిలో
పండ్లూ పువ్వులూ.

13

వయో భారమంతా
చేతి కట్టమీద
ఇక నత్త నడక.

14

రాళ్ళు సిమెంటుల
కలగలుపే
పట్నాలు - నగరాలు.

15

పొయ్యిలో మండే సూర్యుడు
పాలగిన్నెలో
నవ్వే చంద్రుడు.

16

పరుగెట్టే రైలుకు
పట్టాలను కలిపే
తీ(య)రని కోరిక.

17

మానవత్వం
అడవిలా
అంతరించి పోతున్నది.

18

నా కన్న ముందే
నా నీడ
కాలువ దాటింది!

అనువాద కవిత

ప్రసిద్ధ గ్రీకు కవయిత్రి

# బిలిటిస్ గీతాలు

(చైతన్య కవిత- 25వ సంచిక తరువాయి)

స్వేచ్ఛానువాదం

**సౌభాగ్య**



# రాత్రి

నే నతని కోసం అన్వేషిస్తాను
ప్రతి రాత్రీ మెల్లగా, నిశ్శబ్దంగా అడుగులో అడుగులేస్తూ
ఇంటి నుండి బయటపడి అతనికోసం అన్వేషిస్తాను.
దూర దూరంగా సాగి పోతున్న దారిలో వెతుకుతూ పోతాను.
దారి పక్కన పచ్చిక బయల్లో గాఢంగా నిద్ర పోతున్న అతన్ని చూస్తాను
కొన్ని క్షణాలు ఉలుకూ పలుకూలేకుండా మౌనంగా నిల్చుంటాను.
మెల్లగా అతని పైకి వొంగి నా పెదాలతో
అతని శ్వాసని మాత్రమే ముద్దు పెట్టుకుంటాను.
హఠాత్తుగా అతనిపైకి వొరిగి పోతాను.
నా స్పర్శకు అతనికి మెలకువ వస్తుంది.
అతను చేతుల్తో నన్ను దగ్గరకు హత్తుకుంటాడు.
చిరునవ్వు నవ్వుతాడు
పెనుగులాడుతాను, పట్టు వదలడు
రాత్రంతా మేము రహస్యానందంలో తేలియాడుతాము.
రాత్రి క్షణంలో కరిగి పోతుంది
మెల్ల మెల్లగా తెల్లవారుతుంది
పగలు మీదా, ప్రపంచం మీదా నాకు పట్టరాని కోపం వస్తుంది.
మొదటి కిరణం ఎంత దుర్మార్గంగా మాపై వాలుతుంది!
మా మధుర మైన పచ్చిక మైదానాన్నీ
మంచులా కరుగుతున్న అనుభవ జ్ఞాపకాన్నీ
మమ్మల్ని మనసారా ఓదార్చిన రాత్రినీ
ఎలా వొదలి వెళ్ళడం!

* * *

# మగ్గం

రోజంతా మా అమ్మ నన్ను ఆ మారుమూల గదిలో దాచింది.
నాకు కావలిగా నాకు ఇష్టం లేని,
ప్రేమలేని మా అక్కని తోడిచ్చింది.
మధ్య మధ్యలో వాళ్ళిద్దరూ
రహస్యంగా ఏవో గుసగుసల్తో చర్చించుకున్నారు.
మారు మూల నేను మగ్గం నేస్తూ కూచున్నాను.
నాతో మాట్లాడ్డానికి అక్కడ ఎవరూ లేరు
అక్కడ ఎవరూ లేరు
మాట్లాడని మగ్గమూ,
ముసలి తనపు ముసుగేసుకున్న తెల్లని గొర్రెబొచ్చూ తప్ప:
నేను ఈ సమయంలో
పర్వత సానువుల క్రింద, నదీతీరాల్లో
నా ఇష్ట ప్రకారం తిరగాల్సిన దాన్ని.
నిస్సహాయంగా, ఒంటరిగా, దిగులుగా ఈ మగ్గం నేస్తున్నాను.
ఇదంతా ఎందు కొచ్చిందంటే
అతను మా కన్నా పేదవాడు
నేనతన్ని పెళ్ళాడ్డానికి మా అమ్మ చచ్చినా ఒప్పుకోదు
ఐనా నేను మా అమ్మతో కుండ బ్రద్దలు కొట్టినట్లు చెప్పాను
నేను పెళ్ళంటూ చేసుకుంటే అతన్ని చేసుకుంటాను
లేదా బ్రతుకంతా ఒంటరిగా గడిపేస్తాను.

* * *

# పిల్లంగోవి

అతను వసంతోత్సవం నాడు
నాకా అపురూపమైన బహుమతి ప్రదానం చేశాడు
నునుపుగా చెక్కి మనోహరంగా అలంకరించి
రెల్లు గడ్డి కిరీటం రెపరెపలాడే
పిల్ల గాలికే ఉల్లం ఝల్లనిపించే ఆ పిల్లంగోవిని నాకిచ్చాడు
ఆ పిల్లంగోవిని నా పెదాల కానించుకున్నప్పుడు
తేనె కన్నా తీయగా అనిపించింది
అతను ఎట్లా వేణువు వూదాలో నాకు నేర్పించాడు
నన్ను వొళ్ళో కూచో బెట్టుకుని నేర్పించాడు
నేను చివురుటాకులా కంపించాను.
మొదట నన్ను ప్రయత్నించ మనేవాడు, తరువాత తను వూదేవాడు
ఎంతో మృదువుగా, మార్దవంగా, మనోహరంగా
అతని గానం నా మనసును అల్లుకునేది.
ఒకళ్ళతో ఒకళ్ళు చెప్పు కోడానికి మాకేమీ వుండేది కాదు
మేము అతి సన్నిహితంగా
ఒకరి నిట్టూర్పులు ఒకరికి తగిలేంత దగ్గరగా వుండేవాళ్ళం
ఒకరి గుండె సవ్వడికి ఇంకొకరి గుండె ప్రతిధ్వనించేది.
ఒకరి పెదాల అంచులు ఇంకొకరి పెదాలకు తగుల్తూ
ఒకే సారి పిల్లంగోవి మోగించే ప్రయత్నం చేసేవాళ్ళం
సాయంత్రంపై చీకటితెర వాలింది.
బాగా ఆలస్య మైంది.
ఆకు పచ్చని కప్పల ఆలాపనా మొదలయింది.
మరచి పోయిన మేలి ముసుగును
ఇంత సేపూ వెతుకుతున్నానంటే మా అమ్మ నమ్ముతుందా?

# శిరోజం

అతనన్నాడు
'' నిన్న రాత్రి కలగన్నాను నీ శిరోజం ఒకటి నా మెడకు చుట్టుకున్నట్లు
అంతే కాదు నా వక్షస్థలానికి చుట్టుకున్నట్లు
నన్ను కదల కుండా బంధించినట్లు
నీ శిరోజాన్ని చుంబించాను, లాలించాను
ఎందుకంటే నీకు సంబంధించిన దేదయినా నాకు ప్రియమైందే కదా!
మనిద్దర్నీ పెనవేసేవి నీ వినీల కుంతలాలే కదా!
శాశ్వతంగా మనిద్దర్నీ పెనవేసిన నీ శిరోజాల బంధిభానాలో
నీ పెదాలు నా పెదాలకు తగుల్తుంటాయి.
ఒకే పాదులో పెరగిన రెండు పారిజాత వృక్షాల్లా
ఒకర్నొకరు పెనవేసుకుంటాము
అప్పుడు మెల్ల మెల్లగా మన శరీరాలు మరింత మరింత దగ్గరవుతాయి
సన్నిహితంగా కలిసిపోతాయి, సంలీనమవుతాయి.
అప్పుడు నీ శరీరంలో ప్రతి అణువూ నాలో కలిసిపోతుంది,
నాదవుతుంది.
స్వప్నంగా నాలో ప్రవహించే సావకాశం వాటి కుండదు''

ఆనందవు అంచుల్లోంచీ, ఆకాశంలోంచీ స్పృహలోకి వచ్చాకా
అతను మృదువుగా నా భుజాలపై చేతులు వేసి
వెచ్చగా ప్రేమగా నా కళ్ళలోకి సూటిగా చూస్తాడు
వణికే పెదాలతో, ఆనంద భయంతో
అరమోడ్పు కళ్ళని తిప్పుకుని సిగ్గుతో నేల చూపులు చూస్తాను.

* * *

# రాత్రిలో గులాబీలు

రాత్రి వ్యాపించి పర్వతాల మీదుగా ఆకాశాన్ని ఆక్రమించుకున్నప్పుడు
ప్రపంచం మాది, దేవతలదీ!
వసంత కాల సౌందర్యాన్ని కప్పుకున్న పచ్చని పొలాల్లోకి
మే మిద్దరమూ పరుగెడతాం
చీకట్లో దట్టంగా చెట్లు పెనవేసుకున్న వనమార్గాల్లో విహరిస్తాం
మా నగ్న పాదాలే మాకు దారి చూపిస్తాయి
చిన్ని చిన్ని నక్షత్రాల చిరువెలుగుల్లో
మా లేత నీడలే మాకు మార్గం చూపిస్తాయి
ఒక్కో సారి దూరంగా చెట్ల కొమ్మల కింద
నిశ్శబ్దంగా నిద్రించే పల్లెటూళ్ళని చూస్తాం
అన్నటి కన్నా ఆ రాత్రిళ్ళు మమ్మల్ని అపురూపంగా ఆకర్షించిన
అద్భుత మైన చోటొకటుంది
అది మా ఇద్దరికి మాత్రమే తెలసింది
అడవికి అడ్డంగా దట్టంగా పెరగిన
రహస్యాల గుంపు లాంటి గులాబీ పొద
ఈ ప్రపంచంలో గులాబీల పరిమళం కన్నా
రమ్య మైందీ, రహస్య మైందీ,
అమర మైందీ, ఆనందకర మైందీ ఏముంది?
కాని నేను ఒంటరిగా వున్నప్పుడు
అద్భుత మైన ఆ పరిమళాల మత్తును
ఎందుకు ఆఘ్రాణించ లేను?
అనుభూతి చెంద లేను?

* * *

# దుఃఖం

మొదట నేను బదులివ్వనే లేదు
నా బుగ్గలపై సిగ్గు అల్లుకుంది.
నా హృదయ కంపం నా స్తనాల్ని అదిరేలా చేసింది.
అప్పుడు భయంతో వ్యతిరేకిస్తూ ''వొద్దు వొద్దు'' అన్నాను
నా ముఖం పక్కకు తిప్పుకున్నాను
ముద్దుకు నా పెదాలు సమాధాన మివ్వలేదు
నా శరీరంలో సంచలనం లేదు
అప్పుడతను తన తప్పుల్ని మన్నించమని వేడుకున్నాడు, అభ్యర్థించాడు
నా తలని మృదువుగా ముద్దాడాడు
నేను చలించ లేదు.
అతని వేడి నిట్టూర్పులు నా వొళ్ళంతా పాకాయి.
నేను స్పందించ లేదు.
అతను వెళ్ళిపోయాడు
నేను వొంటరిగా మిగిలి పోయాను.
నా పరిసరమంతా శూన్యం అలముకుంది.
పచ్చని చెట్లని ఎడారి కప్పింది.
నేను అసహనంతో, నిస్పృహాయంగా కాళ్ళతో భూమిని తన్నాను.
నా చేతి వ్రేళ్ళని కొరుక్కున్నాను
రక్తం చిమ్మేంతగా కొరికాను
దిగులుగా పచ్చికలో పొర్లి పొర్లి కుళ్ళి కుళ్ళి ఏడ్చాను
నా దుఃఖం వూపిరాడకుండా వుక్కిరి బిక్కిరయ్యేంతగా
పచ్చికలో ముఖం దాచుకుని ఏడ్చాను.

* * *

# కలత నిద్ర

ఒక్కతెనే పొదలో ఒంటరి పావురంలా నిద్రపోయాను
లేతగాలి, గలగలా సెలయేటి సవ్వడి
మాధుర్యం నింపుకున్న రాత్రీ అన్నీ నన్ను పరామర్శించాయి.
కలత పడుతూ నిద్రించాను
రోదిస్తూ నిద్ర లేచాను
కలవర పడ్డాను, సంక్షోభించాను
నిస్సహాయంగా చెక్కిళ్ళపై కన్నీళ్ళు కార్చాను
ఐనా ఈ జ్ఞానం అప్పుడే వుండాల్సింది.
ఇప్పటికే ఆలస్య మైంది
పసిపిల్లలా నేను రోదించినా ప్రయోజన మేముంది?
అతను నన్ను ఒంటరిగా వొదిలి వెళ్ళాల్సింది కాదు
నన్ను దయగా, ప్రేమగా, దగ్గరకు తీసుకుని
లాలించాల్సింది, బుజ్జగించాల్సింది.
అప్పుడు అద్భుతమైన అతని కళ్ళలోకి చూస్తూ
ఆ కళ్ళ కాంతిలో
ఈ చెట్లనీ, భూమినీ, ఆకాశాన్నీ అన్నిట్నీ మరచి పోయేదాన్ని
రాజ్యాల్ని జయించిన వీరాధి వీరులారా!
మీకు నేనో బహుమతి ఇవ్వాలనుకుంటున్నాను
అది ఇంకా చెమ్మగా మంచు కప్పిన అతని అడుగు జాడ
ఒక లేత ప్రియురాలి హృదయం పై
పడిన అతని పాదముద్ర!
నా నిద్ర లేమికి, నా తిరుగుబాటుకు
నేను ప్రతిఫలంగా పొందిన అడుగుజాడ!.

* * *

# మరోపాట

అతను తిరిగి నా ముందు ప్రత్యక్ష మైనప్పుడు
దుఃఖిస్తూ నా చేతుల్లో ముఖాన్ని దాచుకున్నాను
అతనన్నాడు ''భయ మెందుకు ?
మనం ముద్దు పెట్టుకోవడం ఎవరు చూస్తారు?
రాత్రీ చంద్రుడూ తప్ప
నక్షత్రాలూ, ప్రభాతమూ తప్ప''

నేనన్నాను

''సరోవరంలో ప్రతిబింబించే చందమామ
మెల్లగా మన గురించి సరోవరంతో గుస గుసలాడుతాడు
సరోవరంలో సంతోషంతో కదిలే అలలు
తమని స్పర్శించే పడవ తెడ్డుతో చెబుతాయి.
తెడ్డు తన పడవతో చెబుతుంది.
పడవ తన యజమాని జాలరితో చెబుతుంది.
ఏకాంతంలో అతను తన భార్యతో ముచ్చటిస్తాడు
ఈ రహస్యం స్త్రీ చెవిన పడింది కదా!
మా అమ్మా నాన్నా అక్కా
రేపు ఈ సంగతే చర్చించుకుంటారు
గాలికి మాట అందిస్తే ఖండాంతర యానం చెయ్యదూ!

(సమాప్తం)

హిందీ కవిత :

భారత మాజీ ప్రధాన మంత్రి,

ప్రస్తుత లోక్‌సభలో ప్రతిపక్ష నాయకుడు,

జనతను ఉర్రూతలూగించే ఉపన్యాస కేసరి

# శ్రీ అటల్ బిహారీ వాజ్‌పాయ్‌గారి

# రెండుకవితలు

అనువాదం : డా॥ ఎ. బి. సాయిప్రసాద్

1.

## ఔన్నత్యం

పర్వత శిఖరాల పైన
చెట్టు చేమలకు తావులేదు
మొక్కలు వెలుగు చూడవు
గడ్డి పరక పెరుగనే పెరుగదు
అక్కడ
శవం పై కప్పే తెల్లటి గుడ్డలాంటి
చల్లటి మృత్యువులాంటి
మంచు మాత్రమే పేరుకుంటుంది
ఆడుతూపాడుతూ గలగలాపారేనది
ఆ మంచు రూపాన్ని ధరించి
తన అదృష్టంపై
బొట్లు బొట్లుగా కన్నీరు కారుస్తుంది.

స్పర్శ మాత్రం చేతనీళ్ళను
బండ రాయిలా మార్చేస్తుంది
ఔన్నత్యం.
దర్శన మాత్రం చేత మనసును
హీన భావాతో నింపేస్తుంది
ఔన్నత్యం.
ఔన్నత్యం
అభినందనీయం.
పర్వతారోహకులను ఆహ్వానించే
ఔన్నత్యం
జెండాను నాటేందుకే యోగ్యం.
కాని
అక్కడ
ఏ 'గౌరైయా' (జలపక్షి)
తన గూడు నిర్మించుకోలేదు.
అలసి పొలసిన బాటసారిని
సేద తీర్చ లేనివి
ఈ ఔన్నత్యపు ఛాయలు
అసలు విషయం
(మనిషికి)
ఔన్నత్యం మాత్రమే చాలదు
అందరికీ దూరంగా
గుంపుకు ఎడంగా
స్వజనులనుండి వేరుగా
శూన్యంలో ఒంటరిగా
నిలబడడం

పర్వతం గొప్ప తనంకాదు
అది దాని వివశత్వమే.
లోతు ఎత్తుల మధ్య
భూమ్యాకాశాల అంతరం ఉంది
ఎత్తుఎదిగినంతా
మనిషి ఏకాకి అవుతాడు
ప్రతి బరువును తానే మోస్తాడు.
అసలు కావల్సింది
(మనషికి)
విస్తారంతో కూడుకున్న ఔన్నత్యం
మనిషిని మోడు పడనీయని ఔన్నత్యం
ఇతరులతో కలసి మెలసి పోయే ఔన్నత్యం
తనలో పాటు ఇతరులను ముందుకు
తీసుకపోగల ఔన్నత్యం
ఇతరులతో చెట్టపట్టాలేసుకుని
ముందుకుసాగిపోయే ఔన్నత్యం
గుంపులో కలసి పోవడం
జ్ఞాపకాలను నెమరువేసుకోవడం
ఉనికికి అర్థాన్నిచ్చి
మనుగడను సుగంధంతో నింపుతుంది.
భూమాతకు నేడు మరుగుజ్జులు కాదు
మహోన్నతులైన మనుషుల అవసరం ఉంది
ఆకాశాన్ని తాక గలిగనంత ఎత్తు ఎదిగి
నక్షత్రపుపాలాలలో ప్రతిభా బీజాలు నాటే
నవ హాలికుల అవసరం ఉంది
అంత మాత్రాన

దర్భలను మొలవనివ్వని
ముళ్ళను గుచ్చుకోనివ్వని
మొగ్గలను విరబూయనివ్వని
వట వృక్షమంత ఎత్తు ఎదగ కూడదు.
వసంతాలు లేని శిశిరాలు రాని
ఎత్తు దుమారాన్ని లేపుతూ
నిశ్శబ్ద ఏకాంతంలో నిలిచే
చెట్టంత ఎత్తు కూడా ఎదగ కూడదు.
హే ప్రభో!
అన్యులను హృదయానికి హత్తుకో జాలని
ఎత్తు  ఎప్పుడూ నాకు ప్రసాదించకు
అంతటి బీడుతనం ఎప్పుడూ నాకు
ఇవ్వవద్దు.

(**'పద్మ భూషణ్' తో సత్కరించ బడిన తరువాత 1992 ఏప్రిల్ నెల 24 వ తారీఖున ఢిల్లీలో జరిగిన సన్మాన సభలో చదివిన కవిత**)

**2.**

## మనసు తెల్లనైతే-

ఈ యిలాతలం పై
జన సమూహంలో ఉంటూ ఏకాంతాన్ని
ఏకాంతంలో ఉంటూ జనం మధ్యలో ఉన్నట్లు
అనుభూతిని పొందే ప్రాణి మనిషి మాత్రమే.

జనంమధ్య మసతేందుకు మనిషి ఇష్టపడతాడు
ఆన ఇల్లు పరివారంతో ప్రారంభించి
ఊరు వాడను నిర్మిస్తాడు
నగరాలను పట్టణాలను అలంకరిస్తాడు.

నాగరకత నిష్ఠురవు పరుగులో
సంస్కృతిని వెనక్కు నెట్టి
ప్రకృతి పై విజయాన్ని సాధించి
మృత్యువును తన గుప్పిటిలో ఉంచుకోవాలనుకుంటాడు.

ఆత్మరక్షణ కోసం
ఇతరుల వినాశం కోసం
ఆయుధాలను సేకరిస్తాడు।
ఆకాశం పై నింద మోపి
భూమిని వివస్త్రను చేసి
గాలిని కలుషితం గావించి
నీటిని విషపూరితం చేయడానికి కూడా జంకడు.
కాని
ఇంతలు చేసి
ఏకాంతంలో కూర్చొని ఆలోచించినప్పుడు
ఆ ఏకాంతం సొంత యింటి మూల కానివ్వండి
జనసమ్మర్దంతో కూడుకున్న బజారు కానివ్వండి
కాంతి వేగంతో పై కెగిసే విమానం కానివ్వండి
అది
వైజ్ఞానికుని ప్రయోగశాల కానివ్వండి
లేదా

మందిర లేక మణికర్ణికా ఘాట్ కానివ్వండి
ఆత్మ విమర్శ చేసుకున్నప్పుడు
మనసు పొరలు విడిపోతాయి
తనలో తానే మాట్లాడుకుంటాడు
లాభ నష్టాలను బేరీజు వేసుకోడు
ఏం పొందాను? ఏం పోగొట్టుకున్నా నన్న
లెక్కలు వేసుకోడు
మొత్తం జీవితాన్ని తూచి సింహావలోకనం
చేసుకున్నప్పుడు
గీటు రాయి పై తనను తానే ఒరపెట్టు
కుంటాడు
ఎలాంటి మొగమాటం లేకుండా
పక్షపాత రహితంగా ఆత్మావలోకనం చేసు
కున్నప్పుడు
మనిషి తన మనసుతో ఏం మాట్లాడుతాడు?
అవిగో ఆ మాటలకే విలువుంటుంది
అతడి అసలు సత్యం అందులోనే దాగుంటుంది.

అంతిమ యాత్రా సమయంలో
వీడ్కోలు వేళలో
అందరితో విడిపోయేటప్పుడు
శరీరం కూడా వెంటరాదు.
సరిగ్గా అప్పుడే
ఆత్మగ్లాని విముక్తు డొక్కడు చేయెత్తి
''తాను సరైనదని అనుకున్నదాన్నే
జీవితాంతం ఇతడు చేశాడు.

ఇతరులకు తెలిసి తెలిసి బాధ కలిగించాలనికాదు
తన విధ్యుక్త ధర్మంగా భావించి చేశాడు ''
అని అనగలిగితే
అతడి ఉనికి సార్థకమవుతుంది.
అతడి జీవితం ధన్యమవుతుంది.
అలాంటివాడి కోసయే ఈ నానుడి వచ్చింది -
'మనసు తెల్లనైతే ముంగిట గంగ పారుతుంది!'

(1994వ సంవత్సరంలో న్యూయార్క్‌లో చదివిన కవిత )

## నికషోపలం (కవితా సమీక్ష):-

# దిగుమర్తి వారి 'హేమంత ప్రస్థానం'

- జొన్నవిత్తుల రామకృష్ణ శర్మ

భావ కవిత్వంలో ఆత్మాశ్రయం కొట్టివచ్చినట్టుండేమాట యథార్థమే కాని 'హేమంత ప్రస్థానం' తొమ్మిది పద్యాల్లో 'ఏము' అని భారతీయుల్నీ, 'దిష్టి బొమ్మలై' అని ఉద్యమించకున్న అకర్మణ్యులై నీతులు వల్లించే 1. శాస్త్రపండితుల్ని 2.ఉద్రేకవాక్కులైన అభ్యుదయ కవుల్నీఏకంగా 'దరిద్ర భారతీ' అనీ గర్హించి తామందరూ ప్రగతిమార్గం పట్టక 'స్వర్గమరిగాపు గానిన్' (భారత మాతను) 'భజియింప వచ్చునా!' (అసాధ్యము) అని అస్వతంత్రావమాన తాడిత పీడిత భారతీయు లొనర్చే హేమంత ప్రస్థానంలో శిశిరోద్యమవ్రతం చేపట్టి హేమంతవ్యధిత జీర్ణ భావదళాలను దులుపుకొని (హేమంతం పద్మాలకు వ్యాధికారణం అనేది కవి సమయం) కానీ వసంతవైభవం (స్వాతంత్ర్యఫలం) అంది రాదనే సత్యాన్ని ప్రకటించటమే శ్రీదిగుమర్తివారి 'హేమంత ప్రస్థాన' ఖండిక ప్రబోధధ్వనిగా (తత్కాల) వర్త మానంలో హేమంత వ్యాధికి చివికి చిల్లులు వడ్డ పద్మదళ మాత్ర జీవనుడైన కవి దీని కారుణ్యకావ్యగానగీతం వినిపింపజేయటమే వాచ్యంగా వినిపిస్తుంది. ఈ కవిత్వరీతి భావకవిత్వంలోని అస్పష్టతను భావికశక్తిని భావకర్తవ్య నియుక్తంచేసి అభ్యుదయ సిద్ధి పొందగల సాధన మార్గం ఉపదేశించే మార్మికతగా (గోప్యంగా) పరిణామసహం అయిఉండటం గమనించవచ్చు. విశ్వకవి రవీంద్రనాథ టాగూరు తాత్త్విక శక్తిని ప్రకృతి ప్రణయ భక్తియుక్తులుగా వెలువరిస్తే. శ్రీదిగుమర్తి దేశాభ్యుదయశక్తిని దీనకారుణ్యయుక్తిగా వ్యక్తం చేయటంలో ప్రథముడేగాక ఏకైక ఆచార్యుడుగా యశఃకాయులయ్యారు. వారి పరిచయ తుషారమునుండి 'గ్రంథ నామము శ్రీశ్రీమహాప్రస్థానమును దలంపునకు దెచ్చి తదనుకృతిగా భాసించిన నచ్చెరుపు లేదు. కాని మిత్రశ్రీకావ్యప్రచురణకు ముందుగనే ఇది సంకల్పింపబడిన కారణమున ఇందు అనుకృతివ్యామోహము లేదు. ఇందలి హేమంత ప్రస్థానము అనుఖండిక అదే శీర్షికతో భారతిలో చిరకాలము

క్రితమే ప్రకటితమైయునికి దీనితి సాకిరి. విషయమునందును ఇది మిత్రశ్రీకూర్పునకు సజాతీయముకాదు' - అను మాటలు గుర్తు ఉంచుకో వలసినవి. ఇంక విషయ పరిచయానకి మరిలితే -

'హేమంత ప్రస్థానం' ఖండికలో మొదటి ఆఱుపద్యాలూ వర్తమాన (ఆనాటి అస్వతంత్ర) భారతీయవ్యథ వ్యక్తి పరంగా దీన కారుణ్యామయగీతాలు కాగా, తరువాతవి మూడూ కర్తవ్య బోధనా వృత్తాలు కావటం గమనింపవలసి ఉంది. కవిక్రాంతదర్శిగదా! ఇపుడు పద్యాల విషయం. ముందుగా మొదటి పద్యం.

1 తే. గీ. పండుటాకుల మర్మరధ్వనులతోడ
బల్కరించెడు నీ కాలిబాటయందు
నా యడుగులంటి వెన్నంటి నడచివచ్చు
నీడతో నేమి నాకు మాటాడవచ్చు!

హేమంతం గడిచి పోతుంటే దగ్గిర పడుతూన్న శిశిరం అప్పుడప్పుడే రాలుస్తున్న పండుటాకుల గలగల చప్పుళ్లు (స్వాగతాహ్వానం పలుకుతుంటే) కాలగమనంలో వెనుక బడుతున్న హిమ (కాలలక్షణం-చలి) తుషారం నీడవెన్నంటి (హేమంతంగడచి శిశిరం సమీపిస్తూంటే ఆ గడచిపోయే) దానితో బాటసారి ఇంకేం మాట్లాడ (స్నేహంకొనసాగింప) వచ్చు! అంటే వీలు కాదనే భావం వాచ్యార్థం, ప్రకృతిపరం అయిన పరమసత్యం. కాగా బాటసారి మాట పాఠకు డూహించుకోకుంటే 'నీడ' ఎవరిదో అర్థం కాని అస్పష్టత ఉందిందులో. అస్పష్టత భావకవిత్వలక్షణాల్లో ఒకటిగా సమర్థనీయం.

అదే భారత జాతీయ పరంగా చూస్తే హేమంతం ( ఎముకలు కొరికే చలి) బ్రిటిష్ పాలనకు ప్రతీక. దాన్ని కడవ బెట్టడానికే ఈ ప్రస్థానం. పండుటాకుల మర్మరధ్వని కాలం చెల్లిన నీతి శాస్త్రాలను వర్జించే జాతీయోద్యమ నినాదాలకు ప్రతీక. (దాని నిరసన 9వ పద్యంలో భోగులు వ్రాసిన నీతి శాస్త్రముల్ కాలిన గాక' అని స్పష్టంగానే ఉంది ). ఎదిరించి గెలుచుకోవలసిన కాలాన పరిపాలనా

అసమర్థ నినాదాల గడిపే ఉద్యమాలవల్ల ప్రయోజనం లేదనడానికే 'వెన్నంటి (సంప్రదాయం పేర) వచ్చు నీడతో నేమి నాకు మాటాడవచ్చు' అనటం ప్రతీక.

ఇప్పుడు శ్రీదిగుమర్తి వ్యక్తి మార్మికతను గమనిస్తే - ఆయన అనర్ఘరాఘవాది పాఠాలు అద్భుతంగా బోధించిన గొప్పపండితుడని ఆయన్నువిన్న విద్యార్థులంటారు. కాని ఆయనకు పండితుడనిపించుకోవటం కన్న మొదటినుండీ కవిగా చెలామణిగావటమే ఇష్టం. తనకు సృజనాత్మక భావశక్తి మర్మవాక్కుల ఉరికి వస్తుంటే, పూర్వ కావ్య వ్యాఖ్యాపరమైన పఠన పాఠానాల పండితచ్ఛాయ తత్కాల పరిణామ సహాయుక్తిగా అంటివస్తుంటే, తన కిష్టంలేక పోయిన పరిణామాని కెదురు చెప్పలేక పోతున్నాననేదే '' వెన్నంటి వచ్చునీడ (అసలు వ్యక్తి కవిగాక) తో నేమి నాకు మాటాడ వచ్చు'' అనే ప్రతీక.

ఈ ప్రతీక క్రమం పద్యాలన్నింటికి నప్పుతుందా అంటే నిస్సందేహంగా నప్పుతుంది. ఈ విధానం కాకపోతే అసలాపద్యాలు అవగాహనకేరావు, అన్వయ సమర్థంగా ఉండవు. కాబట్టి పద్యాలన్నింటినీ ఇలా ప్రతీకలుగా అర్థంచేసుకోవలసే ఉంది. ఇప్పుడు రెండో పద్యం-

2 తే. గీ. పాడు వడిన గృహోపరి భాగమట్లు
మబ్బుల నట నటఁ బొల్చు శ్యామల నగంబు
వెలిసి పోయిన రాటలు పొలుపుసూపు
మోడులై మ్రాకులీ వన భూమినిల్చి.

ఈ పద్యంలో శిశిరం వచ్చేసింది. నల్లని కొండ మీద అక్కడక్కడ మబ్బు లగపడుతూ పాడువడ్డ ఇంటి కప్పువలె ఉంది. అడవి నేల చెట్ల అకులు రాలి మోడులై పాడుపడిన ఇంటి వెలిసి పోయిన రాట్లలా ఉన్నాయి. పాడుపడిన ఇంటికి పోలికలు కొండనుండి ఒకటీ వనభూమినుండి ఒకటీ తెచ్చికలపటం గొప్ప కల్పనే. పూర్వాంధ్ర కవుల్లో నాచన సోముడిలాంటి ప్రతిభ కనపర్చాడు. నాటికిప్పుడు మళ్ళీ దిగుమర్తి వారు చెయ్యగలిగారు. ప్రకృతిపరంగా ఇంతవరకే వాచ్యార్థం.

జాతీయ పరంగా భారత దేశమే పాడుపడిన ఇంటి ప్రతీక. పూర్వ వైభవం చెదరి పారతంత్ర్యంలో మ్రగ్గటానికి ప్రతీకయే పాడు పడటం. కొండను కమ్మిన మబ్బులు దోచు పాడింటి కప్పునడం కాలానికి సరిపడని సాంప్రదాయిక అస్పష్ట భావ పరంపరాచ్ఛాదనమే. మొండి చెట్ల వెలసి పోయిన రాటలు పోటరులు కాక శాంతి ప్రవచనాభ్యర్థనలు పలుకుతున్న జాతీయ నాయకులకే ప్రతీకలు. ఆ నాయకులనే 8 వ పద్యంలో దిష్టి బొమ్మలై ( విజయపథంలో ) ప్రాకని కింపచుల్ అనటం గమనింపవలసి ఉంది.

ఇపుడు కవివ్యక్తిగా పండితుడన్న పేరునం దాకాంక్ష సన్నగిల్లటానికి ప్రాతయింటితప్పు ప్రతీక. కాగా కవి అనిపించుకోవటానికి తన తొలియత్నంలో విడవరాని ఛందాన్ననుసరించటం వెలిసి పోవటంగానూ, తనసృజనాత్మకత ఇంకనూ వెలువడక పేరుకు రాక నిలచిపోయిన పద్యాలే రాటలుగానూ ప్రతీకలందు కొన్నట్లు చెప్పిన పద్యమిది.

3 తే. గీ. కరఁగు నీరెండలోఁ జలికాచుకొనుచు
ముసలి యావులు కడచిన ప్రొద్దు లెల్ల
నెమరునకుఁదెచ్చుకొని సోలి నిదురవోవు
స్తబ్ధశాంతిలో, బ్రాణఘోషమె నదింప.

ఈ పద్యంలో ముది( మి) యావులు నీరెండలో చలికాచుకొంటూ నెమరవేసుకొంటూ అంతమాత్రానికే సోలినిదుర పోతూ ప్రాణ ఘోష ( ఊపిరి తీస్తూండటం) చేస్తూండటం సహజోక్తి వాచ్యం.

జాతీయ పరంగా వేదాది శాస్త్రవిద్య లధ్యయనం చేస్తూ భారత జాతి స్వేచ్ఛా ఉద్యమాన్ని గురించి పట్టించుకోకుండా ఉన్నవారికి ముదియావులు ప్రతీకలు. ఇందులో ప్రాణఘోష అజపాగాయత్రి స్పందన. వారు ఉద్యమ విజయానికి జపవ్రతాదులు జరిపించాటానికి నెమరు వేయటం ప్రతీక. అంతటితో తమ కర్తవ్యం పూర్తయిందని ఊరుకోవటానికి నిదుర ప్రతీక.

కవి వ్యక్తిగా కవితా సామగ్రిని పూర్వాధునిక కవిత్వ మర్మాలనూ గ్రహించి తన పాటవం యెంచుకొని తృప్తినందటమే చలికాచుకోవటం నెమరకు దెచ్చుకోవటం ప్రతీకలుగా ఏర్పడ్డాయి. కాగా ఆ పాటవం పదును పెట్టుకొనే నవ భావనల యోచనల కనుమూతయే 'సోలి నిదుర పోవు' గా ప్రతీకమైనది. ప్రాణ ఘోషయది కవితా ప్రాణఘోషయే.

4 ప్రాత చేల్ కోతవడ్డ క్షేత్రమ్ములందు
ఆకు పోతల కింకనువ్యవధి కలదు
అంతవర కూరకొన లేక యచటనచట
కొంద ఱేదేని పండించుకో శ్రమింత్రు.

ప్రకృతి పరంగా పంట కోసివేసిన చేలల్లో, నాట్లకింకా వేళకాదు కనుక కొంతమంది(రైతులు) వేఱుసెనగ, పిల్లిపెసర వంటి పంటలు వేసుకొనే ప్రయత్నాల్లో ఉన్నారు. ( ఆ రోజుల్లో ఏడువదలి ఏడు మాత్రమే దాళ్వా అనే రెండో పంట ఉండేది. కనుక ఈ అవకాశమూ ఉండేది ). రైతు జీవనం ప్రతిబింబించే సహజోక్తి వాచ్యార్థం ఇంతే.

జాతీయ పరంగా ప్రథమ ప్రపంచ సంగ్రామంలో సైనిక సాయం చేస్తే మన దేశానికి స్వరాజ్యం ఇస్తామని ఆశపెట్టి భారతీయుల్ని సైన్యంలో చేర్చుకొని సంపాదించిన విజయానంతరం బ్రిటిష్ పాలకులు తొంటిచెయ్యి చూపగా ఉండిపోయిన భారత స్వాతంత్ర్యోద్యమమే మోడు మొదళ్ళుగా మిగిలి పోయిన ప్రాతచేల ప్రతీక. అయినా ఇంకా ఏదో పరిపాలనారంగంలో భారతీయ ప్రజాప్రతినిధులుండేటట్లు ప్రయత్నాలు సాగించి గెలుచుకో చూడటానికి కొందరితరపంట లేవో పండించుకో శ్రమించటం ప్రతీక. పై పద్యమునుండి గ్రహించిన ప్రాణఘోష ఇప్పుడిట సంపూర్ణ స్వాతంత్ర్యాశకు ప్రతీక.

కవి వ్యక్తిగా పాండిత్య ప్రతిభకు ఉద్యోగ ప్రాప్తి మాత్రంగా కవిత్వ సృజనాత్మకత - మోడై కోతవడ్డ ప్రాతచేల ప్రతీకనందగా, వదలివేయలేని సృజనాత్మక

వ్యాసంగ యత్నమే రైతులితర పంటలు వేయ శ్రమించటంగా ప్రతీకనంది ఉంది. ఏడో పద్యమంతా దీనికి సాక్ష్యమే.

5 తే. గీ. ఎంత దూరము వచ్చితి నీ విచిత్ర
మేమొ ఇటఁగూడ హేమంతమే హిమార్ద్ర
విశద సీమాంత మాముక్తవృంత భావి
నిధన సుప్త లతాంతమే నిలువరించు.

ఇప్పటికి శిశిరం కూడా గడవ వచ్చినా మిగిలిన శిశిరం (ఆకులు రాలు కాలం)లో తొడిమనుండి ఊడిపడి వదలిపోవు పూవు మంచుతో తడిసి చలినింపుకొన్న సీమాంతం (నీటి పట్టు - బందుగుల నంతదాకా సాగనంపటం మన సంప్రదాయం) చొరరాకున్నదని ఆపేస్తూనే ఉంది అన్నదే వాచ్యార్థం.

జాతీయ పరంగా ప్రథమ ప్రపంచ సంగ్రామమే కాదు ద్వితీయం కూడా జరిగిపోయింది. అయినా భారత దేశం స్వేచ్ఛను పొందక ఇంకా పారతంత్ర్యదోషమే (కిరసనాయిలు కూడా దొరకనంతగా) పీడిస్తూ స్వరాజ్యోద్యమాని కడ్డు కట్టగా ఉన్నదానికి ప్రతీకయే పద్యంలో నిలువరించే హేమంత హిమార్ద్ర సీమాంత ప్రవేశాన రాలి పోయేపూవు.

కవి వ్యక్తి పరంగా తానెంత కవిత్వం వ్రాస్తున్నా పండితఖ్యాతి - కవిఖ్యాతి నడ్డుకుంటూనే ఉండటానికే శిశిరాంత లతాంతం నిలువరించే ప్రతీక. పండితఖ్యాతిని కడుగు కోటానికే సీమాంత( నీటిట్టు) మందుకొనే ప్రతీక.

6 తే. గీ. కాల గర్భమ్ములో సుడిగాలి రేగి
కడలి యడల నఘాతమున నొడలువిరిచె
ఈ నవోదయమున పరాధీన విశ్వ
నగ్న జీవిత నినదించు నా గళమ్ము.

ఈ పద్యంలో కవితావస్తు సామాన్య ఔచిత్యం సడలినప్పటికీ కాలం గడచి శిశిరమూ పూర్తికావటం - వసంతారంభం నవోదయంగా ప్రకటితమయింది. ఇది పూర్తిగా ప్రతీక కవిత్వం. వాచ్యార్థం అవ్యక్తం. అస్పష్టం.

జాతీయు పరంగా కాల క్రమంలో గొప్ప మలుఁపు తిరగటం సుడిగాలిరేగటంగానూ, ఇంగ్లీష్ ఛానల్ అనబడే కడలి అడలటం బ్రిటిష్ ప్రభుత్వమే క్విట్ ఇండియా మూవ్‌మెంటుకి గడగడలాడటంగానూ, బంగాళాఖాతమనబడే అఖాతం - భారత స్వాతంత్ర్యోద్యమం ఆ మూవ్‌మెంటుతో చెలరేగటం ఒడలువిరవటంగానూ, ఆ తర్వాత స్వాతంత్ర్యం లభించటం నవోదయంగానూ, ఆసమయంలో స్వేచ్ఛాపటం కప్పేటప్పుడు పాకిస్తాన్ చీలివిడిపోవటం భరించలేక పరాధీన ఐక్య భారతం (స్వేచ్ఛాపటహీన) నగ్న జీవికగానూ ప్రతీకలుగా నిలుపుకొని తన గొంతు ఏకతా - సంపూర్ణ భారతగానం చేస్తూందంటారీ మార్మిక కవి. ఇది స్పష్టంగా వ్యక్తమైన మార్మిక కవితామణి దీపం.

కవి వ్యక్తిగా- కాల గర్భంలో సుడిగాలి రేగటం తన ఆనర్స్ విద్యపూర్తికాక పోవటం. అందుకు మనసుచెదరటం కడలి యడలటం. పట్టుదలతో శ్రమించటం అఖాతం బడలు విరుచుకోవటం. విజయనవోదయ వేళ పూర్వ పరీక్షాధ్యయన (పరా) ఆధీనమై చేసిన విద్యాశ్రమఫల స్పష్టార్థ నగ్న జీవికను మరచిపోక తలుచుకుంటూ ఉంటాననడమే నాగళం నినదించు ననటం. పూర్వ విద్యాబలమేగా పాత వ్యాఖ్యానాల పలికేది! ఇక్కడి తో తేటగీతు లైపోయాయి. తరువాతి వృత్తాలు మూడూ ఉత్పలమాలలే.

7 ఉ. తీరనియీ విషణ్ణ మ - దీయ కుటీర సమీప జీర్ణ కే
దారములందు కొన్న ఫలి - తమ్ముగ నెంచితిఁ గాని ఒక్కటే
తీరుక్షమాలయమ్ము నక్ష - తింబడి నేఁదల దాచు కొన్న దో
చూఁరను మాట ఇప్పటికి - సూ తెరయెత్తె దరిద్ర భారతీ!

ఇందులో వదలని విచార ధారకు తన పాకదగ్గరున్న బీడువద్ద పొలాలను అందు కోవటంవల్ల కలిగిన ఫలితం అనుకొన్న ప్రస్థాన పథికుడు తానున్నది పూర్తి

పాకకాదనీ, శిశిరం గడచి వెచ్చదనవు శాంతి దేవాలయంలో దెబ్బతిని తలదాచుకొన్నది ఆ పాకచూరు మాత్రమే ననే నిజం, ఈ వసంతారంభంలో అమాయకపు తెర తొలిగి బయటపడటం వల్ల కూడా సుమా అని కుమలిపోవటం ఉంది. ఇదీ అవ్యక్తాస్పష్ట మాధుర్యభరమే. పూర్తిగా ప్రతీక రచన. మార్మికతకు లక్ష్యం. వృత్తాలు మూడూ ఈ కోవలోవే.

ప్రస్తుత వృత్తంలో నాలుగవ తేటగీతిలోని కోతలైన ప్రాత చేలల్లో వేరే పంటలు వేసుకోజూచిన రైతుల తాపత్రయానికీ పద్యం ప్రతీక. కోతలయి పంటతోనిండి ఇల్లుండటం నిండుకుటీరం తనదనుకోవటంగా ప్రతీక నందింది. మళ్ళీ ఆ ప్రాత పొలాల్లో వేరేవో పంటలు వేయ ప్రయత్నించి ఇప్పుడవి పండక జీర్ణకేదారాలయి పంటరాని బీడులందటం విషణ్ణతకు కారణం అనుకొంటుంటే (బహుశః రెండవ పంట వేయటానికి ఇతర ఎవో అవసరాలకీ చేసిన అప్పుల కాయింటి పొలంతా పోయి) చూరు మాత్రం మిగలటంగా తన దారిద్ర్యం తెలిసి వచ్చిందనుకోవటం ఈ పద్యంలో ఉంది.

జాతీయ పరంగా సంపూర్ణ స్వారాజ్య సిద్ధినందిన భారతదేశం కుటీరంగానూ, అందులోనుంచి పాకిస్తాను విడిపోయి కొంత భాగం మాత్రమే భారతదేశంగా మిగలటం ఆ కుటీరపు చూరుగానూ ప్రతీకలందాయి. స్వాతంత్ర్య ఫలం బ్రిటిష్ వారినుండి పొందటం సమీప జీర్ణకేదారము లందుకొన్న ఫలితంగా ప్రతీకనందు కొంది. కాగా శాంతి సూత్రాలు వల్లించటమూ దానివల్ల దేశం ముక్కలై ఓ ముక్క మనకు దక్కటమూ 'క్షమాలయంబున క్షతింబడిన' విగా ప్రతీకలయ్యాయి. ఆ భాగ లోపంవల్ల ఏర్పడిన దేశము 'దరిద్ర భారతీ' అన్న సంభావనగా ప్రతీక. అలా ఈ సంభావన సమంజసమే అయింది.

కవి వ్యక్తిగా తాను పొందిన డిగ్రీ సర్వసమృద్ధినీయగల ఉపాధికీ, తన సృజనాత్మక కవి గౌరవలాభకరమైందీ అన్నభావమే కుటీర ప్రతీక. కాని దొరికిన ఉద్యోగం (ఆదాయ విషయంలో అసంతృప్తి లేకపోయినా) పాఠాలు చెప్పుకుంటూ ఉండవలసిందిగా పండిత కీర్తిని విస్తరింప జేసేది మాత్రమే కావటం కుటీరపు చూరుగా ప్రతీక అయింది. దొరకిన ఉపాధే 'సమీప జీర్ణకేదార' ప్రతీక. తాను

కాదనక అంగీకరించటమే 'క్షమాలయంబున క్షతింబడి' తలదాచుకోవటంగా ప్రతీక. ఈపద్యం సర్వతః పుష్ట ప్రతీక లక్ష్యంగా ఉంది.

ఇక్కడొక మాట: కొందరీ రచనా కాలం నాటికి రచయితకి ఉద్యోగాది అనుభవాలు కాలేదనవచ్చు. కాని నాటి వర్తమాన పరిస్థితులకు భావి పరిణామస్థితి నూహించి వ్రాయలేక పోతే కవిని క్రాంతదర్శి అని ఎలా అనగలం? తక్కినవి అంచనాలకు వదిలినా శ్రీదిగువర్తి వారికి పండితుడనికాక కవి అని అనిపించుకోవాలన్న అభిలాష కలదనటం సన్నిహితు లందరికీ తెలిసిన సత్యం. ఇదే పై అంచనాల కాధారభూతమైంది.

మరోమాట: ఈ పద్యాలొక్కపట్టున కూర్చొని వ్రాసినట్లు లేవు. గీతాలకీ వృత్తాలికీ మధ్య ఏకొంతైనా కాల వ్యత్యాసం ఉండే ఉంటుందనిపిస్తుంది, చూడండి-

8 ఉ. ఆకలి కొల్ల గొన్న నిల - యాల పునాదుల పైన మేడలే
దీకొన క్రౌర్య శిల్పి తెగ - దిద్దిన రేఖలు జీర్ణ చర్మ శ
ల్యాకృతులై రహింప బహి - రావరణంబున దిష్టిబొమ్మలై
ప్రాకని కింపచుల్ తిరుగ - వైతురు కర్మ ఫలమ్ములోపుటల్.

ఇందులోనూ ప్రస్థాన పథికుడు వాస్తవాన్ని గ్రహించి ప్రకటించటం వరకే హేమంత వస్తు ప్రయోజనం. పూరిళ్ల పునాదుల మీద పెద్ద పెద్ద మేడలు పోటీ పడి నిలుస్తుంటే పేదలు జీర్ణ చర్మ శల్యా కృతులై పోతుంటే ఇతరులు పేదధనికవర్గాల బహిరావరణంలో మధ్యస్థులై దిష్టి బొమ్మలుగా ఏవర్గానికీ ప్రాకని క్రియాశూన్యులు భగవద్గీతాదుల కర్మ ఫల త్యాగ గ్రంథాలను తిరుగ వేస్తుంటారు అనేది వాచ్యార్థం. వీళ్ళే రెండవ తేటగీతిలో పాడువడిన ఇంటికి వెలసి పోయి నిలచి ఉన్న రాటలు.

జాతీయ పరంగా ఆకలిగొన్న నిలయాలు శ్రామిక వర్గ ప్రతీకలు. ఆపునాదులపైన మేడలే దీకొనటం ధనికవర్గం పూర్వ వర్గాన్ని పీడించి పనిగొనటానికి ప్రతీక. మళ్లీ క్రౌర్య శిల్పి ధనిక వర్గం నెలకొలిన యంత్రాగార వ్యవసాయ క్షేత్రాదుల

ప్రతీక. అలాగే ''జీర్ణ చర్మ శల్యా కృతులు'' శ్రామిక వర్గంలో రక్తమాంసాలు హరించిపోయి మిగిలిన జీవచ్ఛవాలకు ప్రతీకలు. కాగా ఇటు నటు చేరక నిలిచి పోయిన వారికి '' బహిరావరణంబున దిష్టిబొమ్మలై ప్రాకని కింపచులు'' ప్రతీకలు. కర్మ ఫలంలో పుటలు తిరగవేయటం శాంతి ప్రవచనాల కాలంగడిపే తీరుకు ప్రతీక. వారు కూడా కార్యోన్ముఖులు కావాలన్నదీపద్య ప్రబోధం.

కవి వ్యక్తి పరంగాజిజ్ఞాసువులైన విద్యార్థులకు ఆకలిగొన్న నిలయాలూ, ఆనిలయాల పునాదులమీద మేడలే దీకొనటం పఠన పాఠనాలు పండిత ఖ్యాతియే తనకు ఎదురవటానికీ ప్రతీకలు. ఆపండితఖ్యాతికే క్రౌర్య శిల్పి ప్రతీక. దానివల్ల, విఖ్యాతి సన్నగిల్లటానికే జీర్ణ చర్మ శల్యాకృతి ప్రతీక. కాగా బహిరావరణంలోని దిష్టిబొమ్మలు ప్రాకని కింపచు లనటం, కర్మఫలం పుటలు తిరుగవెయ్యటం అంతా రకరకాల మెప్పులాడే మిత్రవర్గ ప్రతీక ప్రభ. పాపం ఆయన బాధ ఆయనది.

9 ఉ. కాలము శృంఖలంబయి సు-ఖంబొకనాడును డొక్క-నింపుకోఁ
జాలని దేహమందుఁ జెర-సాలఁగ మూల్గెడి వారినెంచి తాం
బూల రసమ్ముతోఁదడిపి-భోగులు వ్రాసిన నీతి శాస్త్రముల్
కాలిన గాక స్వర్గ మరి-గాపుగ నిన్ భజియింపవచ్చునా!

కడపటి పద్యంగా ఇది హేమంత ప్రస్థానం ఖండికకి భరత వాక్యం కదా! (ఉద్యోగ) కాలం ఒక సంకెల కాగా శరీరం ఒక చెఱసాల అయి (వాంఛిత) సుఖంలేక (ఒకప్రక్క) డొక్క నిండక మూలుగు (తీరని విషణ్ణత) తో ఉన్న (తనలాంటి) వారిని గూర్చి, వ్రేలు పెడితే అందేలాతిని తాంబూలం వేసుకొని ఆ రసంతో తడిపి ఆ భోగులు బహిరావరణంబున దిష్టిబొమ్మలై ప్రాకని కింపచుల్ శ్రామికులకు పనికిరాని విప్లవ నినాద గీతనీతులు అకర్మణ్య శాస్త్రాలు కాలి పోతేనే గాని (సామరస్య పూర్వకమై కర్తవ్యతాప్రపుల్లమై సమాజ పద్మాల) నిన్నుభజింపవచ్చునా? వీలుకాదు అనేది వాచ్యార్థం. హేమంత ప్రస్థాన వస్తువు కాలవస్తువుగా మాత్రం ప్రస్తావింపబడింది.

జాతీయ పరంగా శ్రామిక వర్గంమీద రచనలూ ఉపన్యాసాలు చేస్తూ ఆ విప్లవ ధోరణితో భోగాలూ పదవులూచేపట్టి కులుకుతున్న భోగుల కూట నీతి శాస్త్రాలు నశించి నప్పుడుగాని భారతదేశాన్ని స్వర్గమరిగాపుగా సేవింప వీలుగాదనీ, ఆ వీలు కలగాలనీ ఆశాభావం వ్యక్తీకరింపబడింది.

కవివ్యక్తి పరంగా ఉద్యోగం శరీరానికీ, ఆ ఉద్యోగ కాలం సంకెలకూ, సృజనాత్మక కవితా సృష్టిచేయు తృప్తికి వీలుగాక పోవటానికి డొక్కనింపుకోజాలక పోవటమూ, పూర్వకావ్య వ్యాఖ్యానాలు చేయటానికి మూలుగూ ప్రతీకలు కాగా, తీరుబడి గా బోధనా ప్రయాస లేనివారు తనకు అంటగట్టే పండిత ప్రశంసలకు తాంబూలరసమ్ముతో దడిపి భోగులు వ్రాసిన నీతిశాస్త్రాలూ ప్రతీకలు. అవి తప్పిపోవ టానికి కాలటం ప్రతీక. అట్లు కాలినప్పుడే స్వర్గ మరిగాపుగా కవి ప్రతిష్ఠ భజింపవచ్చు నన్న ఆశాభావంతో పద్యమూ ఖండికాకూడా ముగిశాయి.

మార్మిక కవిత్వానికి ఆధునిక యుగంలో విశ్వకవి అయిన రవీంద్రనాథ ఠాకూరు సాంప్రదాయిక  ఛందస్సు వద లి వచన గేయాన్ని ఆశ్రయించగా, గీతాంజలిని తలస్పర్శగా శోధించిన శ్రీదిగుమర్తి వేంకట సీతారామస్వామిగారు ఆంధ్ర ప్రసిద్ధ ఛందాల్లోనే సాధించి, మార్మిక కవిత్వానికి సాహిత్య ప్రపంచంలో ప్రథమాచార్యుడై యశః శరీరులయ్యారు. ఆ ఉత్తమాచార్యునికే ఈ పరిచయం వ్యాసం అంకితం.

**'హేమంత ప్రస్థానము - ఇతర కృతులు'- దినుమర్తి సీతారామస్వామి, ప్రతులకు : డి. జగన్నాథ శౌరి, హెచ్. ఐ. జి. ప్లాట్ నెం 107, సాగర నగర్, విశాఖపట్టణం 530 045. వెల: రూ. 20-00.**

# WOMB OF THE GRAVE YARD

-Dr. J. Bapu Reddy

Daily I walk
from my house to a grave yard
from West to East
winding, rewinding three Kilometers
around my circumamblating feet
A Doctor's prescription, physical exercise,
turns into a spiritual experience for me.
Now I don't bother about fitness to live
but fitness to die.
Doctor certified my fitness to exist
But the grave yard whispers to my wavering self
"you are not yet fit to exit
for embarking on a marathon journey".
Under my feet
I feel the earth's gyration
from West to East
a desperate run for its own survival.
Mute rocks squating patiently
on the contours of the corrugated landscape

watch my weary movements
in inscrutable wonder.
The trees glued to the ground
stretch their heads towards the eluding sky
as if to know their own fate !
Birds,
hosping from branch to branch
count the sprouting and falling leaves
mark their time
keep themselves busy
to beat mundane monotony,
Everything appears to await the arrival
of the ineluctable moment
for the inevitable entry
into the womb of the grave yard.

# SIR ARTHUR COTTON - A SUNBEAM

-Janga Gandhiji

Moon
of the autumn
Luminosity
of the gold
Flame
of love
Fragrance
of the rose flower
Saa Ree Gaa Maa
Of secret River Godawari
Recollects you
Sir Arthur Cotton
You are a product
Of the universe
And architect
Of the gigantic Anicut
A miraculous
achievement
The Compassion
Has found form in you
The affection
Has found Song in you
You have transformed
The effort
Into humanity
The work
Into agility
The poverty
Into prosperity
The darkness
Into brightness
The pain
Into bliss
Your pool of skill

Your futuristic outlook
Your benevolent gesture
Your ease
Your wisdom
Viable to the Ryots
The green festoons
From Island to Island
The flow
Of Gouthami
The Sweet sounds
Of Vasishtha
The power
Of Vainatheya
And the hymn sounds
Of the holy-dip
And the cher-up
And.......Lady Cottons
Noblest feet
Remembers your era
And beaming Joy for the
People.

(**Courtesy**: Indian Civil Engineers)

## GO AND LIVE THERE

-M. V. Krishna Rao

*Many Many things facinate me*
*How can I refuse those glittered things*
*Though I am little my desires are like ocean*
*It may be the fair sex, it may be the huge palace*
*Some times yellow metal and currency*
*Those above seems cherished fruit*
*At the same time I hear cautions*
*and interrupt every desire*
*and force me sometimes not to wish*
*I prayed, I orderred not to come in the way*
*again and again*
*With perplexed mind, I neither deny nor accept*
*it's suggestions*
*So I want to burry it in far place in grave yard*
*And I ask it go and live there*
*Remembering the effect of the first couple*
*of mankind*

## DEATH

*-M. V. Krishna Rao*

The name I like very much which all mankind fears
Because it can save from all awkward situations.
None can entice me thereafter
Is it not a boon to mankind
I pray God not to extend anybody's life
If he rellay wishes to save from each other.
Oh Shylock you were the noble person
You didn't ask kidney eyes or heart
You asked only one pound of flesh
Millions not like you. seeking judgement
all over the globe
Oh professionals be prepared to come to
comfortable place
Untill that you decide what you want to be.

# THE WORLD BEAUTY - UNIVERSAL SISTER

-Dr. Gelivi Sahadevudu

- Momentary beauty grace joy
  A beauty contest employ
  crowned with success she bears

- Serving the deserving poor
  consoling the distressed for sure
  without rest day and night
  Dispensing duties to the sick as their right

- Strange colour stranger costumes
  she wears strange poses assumes
  Dazzling in golden lace, she bares
  No other dares

- Her White attire like a garland
  of Jasmine flower doth stand
  For Purity. Its Whiteness
  Is Excelled by her mental fitness
  Which restores our calmness

- Millions gather to observe
  Many a pretty grace and curve
  Others in advance arrive
  Before T.V. Sets. Thier eyes strive
  Not to miss any close-up alive

- She Fills new breath
  In Patients near death
  She dispels thier fears
  They show thanks with tears

- Spectators, fans clap without rest
  Only to repeat them at the next test

- Our sisters instill gratitude
  The Patients clasp palms in thankful attitude

- The beauty queen's reign is short
  She is a queen for a year

- The Universal sister fort is in the Hospital
  Ever awaiting a call

- The one shines a moment indeed
  The other attends the sick in need.

# BONDED IN DEATH AS IN LIFE

-Dr. J. Bapu Reddy

Sanober Marker, Naoshir Marker
you were made for each other
you lived together, moved together
Holding your three tender offspring
in your ecstatic eyes, you dreamed together

you lived a life gods envied
you cherished ideals all admired
you were not a couple but a couplet
which defined life and defied death-

Bathed in poesy, clothed in poesy
you breathed poesy of eclecticism
speaking poetry, smiling poetry
you symbolised dauntless spirit of humanism-

Bombay called you on an ominous day
for a rendezvous with devouring destiny
you were travelling in a car on a visible highway
the invisible cruel Time's wheel
crushed your life-vehicle in a terrific split second
hurled you into a voyage of no return !

The mighty Western Ghats helplessly watched
the heinous horrendous massacre
that treacherous fate committed in broad day-light
The savage death uprooted a branching family tree
leaving the ravaged life garden in thorny pangs.

Alas! the hoary mansion you adored
the historic city you adorned
the poetry society you enriched
countless friends, kith and kin you endeared
all miss you badly, feel impoverished,
yet they treasure the precious reminiscences
of your demulcent disposition

You made us recite poetry
on varied themes replete with scintillating thoughts.
But who imagined a mortal tragedy
would strike our beings with bleeding poems
that pour out deeps of our sorrow
in tearful homage to your immortal memory
"Bonded in death as in life"

# సాహిత్య అకాదెమీ

## దక్షిణ ప్రాంతీయ కార్యాలయం, బెంగుళూరు

## తెలుగు ప్రచురణలు

**భారతీయ సాహిత్య నిర్మాతల పరంపర - ఒక్కొక్కటి రూ. 15-00**
అన్నమాచార్య - ఎ. ఆర్. ఆర్. వర్మ- భారతేందు హరిశ్చంద్ర - బంకిం చంద్ర ఛటర్జీ - భవభూతి - బుద్ధదేవబోస్ - చందు మీనన్ - దత్తకవి - ధర్మవరం రామకృష్ణమాచార్య - ఫకీర్ మోహన్ సేనాపతి - గాలిబ్ - గురజాడ- హెచ్. ఎస్. ఆప్టే- జయదేవుడు-జీబానందదాస్- జ్ఞానదేవుడు -కల్హణుడు- కాజీ నజ్రుల్ ఇస్లాం-మహాకవి ఉల్లూర్- డా. సి. ఆర్. రెడ్డి - మాణిక్యవాచకర్ - ఎం. డి. టాగూర్ - మాణిక్ బందోపాధ్యాయ్ - నామదేవుడు - నమ్మాళ్వార్ - నర్మద్‌శంకర్ - నజీర్ అక్బరాబాదీ - పంజే మంగేష్‌రావు - పోతన - సరోజనీనాయుడు - రాహుల్ సాంకృత్యాయన్ - రాజారామమోహనరాయ్ - సరళాదాస్ - శ్యామసుందర దాస్ - యు. వి. స్వామినాథ అయ్యర్ - విద్యాపతి - దేవులపల్లి కృష్ణశాస్త్రి - జాషువా.

**నవలలు :** మట్టిదీపం (రూ. 30-00) - నగర మథనం (రూ. 15-00) జనవాహిని (రూ. 40-00) -సమాజపు కోరల్లో (రూ. 30-00) - కలకత్తాకి దగ్గిరలో (రూ. 50-00) - రొయ్యలు (రూ. 45-00) - భవిష్యత్తు బహుపరాక్ (రూ. 45-00) - సమయం కాని సమయం (రూ. 90-00) - ప్రభాత వదనం (రూ. 90-00) - అమృతం : విషం (రూ. 160-00) - జవహర్‌లాల్‌నెహ్రూ జీవిత చరిత్ర (రూ. 130-00) - ఉమరావ్ జాన్ అదా (రూ. 30-00) - చిదంబర రహస్యం (రూ. 150-00) - నారు : నీరు (ముద్రణలో)

**చిన్న కథా సంకలనాలు :** తమిళ సాహిత్య కథలు (రూ. 40-00) - తెలుగు కథ (రూ. 110-00) - ఒక తరం తెలుగు కథ (రూ. 130-00)- కన్నడ కథానికల సంకలనం (రూ. 145-00) భారతీయ సాహిత్యం - సమకాలీన కథానికలు (రూ. 250-00)

# చైతన్య కవితా వేదిక

నెం. 40/12-7, 'సౌరభ' (మేడపైన), 22వ క్రాసు,
గోవిందరాజనగర, విజయనగర, బెంగుళూరు - 560 040

గౌరవాధ్యక్షులు : శ్రీ తిక్కవరపు పట్టాభిరామరెడ్డి (పఠాభి)
డా॥ గుంటూరు శేషేంద్ర శర్మ (శేషేంద్ర)

అధ్యక్షులు -
**మహారాజ పోషకులు** : శ్రీ దళవాయి కృష్ణస్వామి ఆదికేశవులు

**ఉపాధ్యక్షులు** : శ్రీ బుల్లా సుబ్బారావు, ఐ. ఎ. ఎస్.
శ్రీ సకలా నరసింహులు శ్రేష్ఠి
శ్రీ కె. పి. రావు
శ్రీ వై. వి. వెంకటేశ్వరరావు
డా॥ జె. బాపురెడ్డి, ఐ. ఎ. ఎస్. (రిటైర్డు)
డా॥ శ్రీపాద కృష్ణమూర్తి

కార్యదర్శి : ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు (తంగిరాల)

సహకార్యదర్శులు : డా॥ దివాకర్ల రాజేశ్వరి
శ్రీమతి అంబికా అనంత్
శ్రీ న్యాయపతి శ్రీనివాసరావు (వాసు)
డా॥ ఎం. రుక్మాంగద నాయుడు
శ్రీ వి. రామనరసింహారెడ్డి
డా॥ పి. యు. బి. శర్మ
డా॥ కె. చంద్రప్ప

కోశాధికారి : శ్రీ తంగిరాల శ్రీనాథ కవిసార్వభౌమ

# చైతన్య కవిత

## 1997లో చేరిన చందాదారుల వివరాలు

**పోషకులు :**

1. శ్రీమతి విజయ కుమారి, శ్రీ ఎం. రామనాథంనాయుడు, కర్ణాటక స్టేట్ ఓపెన్ యూనివర్సిటి , మైసూరు.
2. శ్రీమతి మరియు శ్రీ తమ్మన వేంకటేశ్వర రావు, భీమవరం, పశ్చిమ గోదావరి జిల్లా.
3. శ్రీ ప్రసాద్, ఎ.చోడవరపు, రోచేస్టర్, న్యూయార్క్, యు. ఎస్. ఏ.
4. శ్రీమతి మరియు డా॥కె. ప్రభాకర రెడ్డి, పద్మానర్సింగ్ హోమ్, ప్రొద్దుటూరు, కడప జిల్లా.
5. శ్రీమతి రామక్క, శ్రీ అగళి ఈరణ్ణగారి చిత్తన్న దంపతుల పేరుమీదుగా వారి కుమారుడు శ్రీ సి. కృష్ణమూర్తి, పేలుబండ గ్రామం, కెంకెర పోస్టు, అమరాపురం మండలం, అనంతపురం జిల్లా.
6. శ్రీమతి మరియు డా॥ పి. శ్రీనివాస గురుమూర్తి, వెల్దుర్తి, కర్నూలు జిల్లా.
7. శ్రీ కె.కె. మాధవరావు, 14041, ప్రిస్టన్ రోడ్, 801-ఇ, డల్లాస్, టి ఎక్స్-75240, యు.యస్.ఏ.
8. శ్రీ పరుచూరి శ్రీనివాస్ S/O శ్రీ పరుచూరి ప్రభాకర రావు, వల్లభాపురం పోస్టు, తెనాలి ఆర్. ఎం. ఎస్., గుంటూరు జిల్లా 522 308
9. శ్రీమతి మరియు శ్రీ ఎ. కృష్ణమూర్తి, అధ్యక్షులు, మోడల్ చిట్-కార్ప్ లిమిటెడ్, పంజాగుట్ట, హైదరాబాదు- 500 082.
10. శ్రీమతి విజయలక్ష్మి, శ్రీ వి. యస్. ఆర్. శర్మ, ఆడిటర్, సజ్జాపురం, తణుకు, పశ్చిమ గోదావరి జిల్లా.
11. సహజ కవి డా॥ మల్లెమాల ( డా॥ ఎం. ఎస్. రెడ్డి ) ప్రముఖ చలన చిత్ర నిర్మాత, శబ్దాలయ, హైదరాబాదు - 500 034

## జీవిత సభ్యులు :

1. డా॥ ద్వానా. శాస్త్రి, అమలాపురం, తూర్పు గోదావరి జిల్లా.
2. శ్రీ పి.నాగేశ్వరరావు, మేనేజింగ్ డైరెక్టర్, వైశ్యాబ్యాంక్ హౌసింగ్ ఫైనాన్స్ లిమిటెడ్, బెంగుళూరు.
3. శ్రీ కలవచర్ల గోపాల కృష్ణమూర్తి, మేసన్ నెట్‌వర్క్స్ ప్రవేట్ లిమిటెడ్, బెంగుళూరు.
4. శ్రీ ఎస్. జయరాములు S/O శ్రీ ఎస్. దాలప్ప, ఊతకూరు, పరిగి మండలం, అనంతపురం జిల్లా.
5. డా॥ యస్. శారదాదేవి W/O శ్రీ యస్. వ్యాస కవీంద్ర, గచ్చిబౌలి, హైదరాబాదు - 500 133.
6. డా॥ ఎస్. బషీర్, హిందూస్తాన్ పెట్రోలియం కార్పొరేషన్ లిమిటెడ్, ఎగ్మూరు, మద్రాసు 600 008.
7. డా॥ కె. కె. వి. శర్మ, టీచరు, కేశవ మెమోరియల్ బోయస్ హైస్కూలు, నారాయణ గూడ, హైదరాబాదు 500 029.
8. ' జింబో ' ( శ్రీమంగారి రాజేందర్ ), హిమయత్ నగర్, హైదరాబాదు 500 029.
9. శ్రీ బసిరెడ్డి శ్రీనివాసులు రెడ్డి, ఎ. కె. నగర్, వేదాయపాలెం, నెల్లూరు.
10. శ్రీమతి నల్లూరి హేమకుమారి, గాంధీపురం -2, రాజమండ్రి.

## ప్రత్యేక సభ్యులు :

1. శ్రీమతి టి. ఆర్. మీనలోచని, సాహిత్య అకాడమి, బెంగుళూరు.
2. శ్రీ శంకరమంచి శ్యామ ప్రసాద్, చొప్పదండి, కరీంనగర్ జిల్లా.
3. శ్రీ కె. శ్రీధరన్, కృష్ణరాజపురం, బెంగుళూరు.
4. ఆచార్య మాదిరాజు రంగారావు, వరంగల్లు.
5. శ్రీ ఎస్. శ్రీకంతరావు, బెంగుళూరు.

6. శ్రీ తమ్మన వేంకటేశ్వర రావు, భీమవరం, పశ్చిమ గోదావరి జిల్లా.

7. డా॥ పి. ఓబులరెడ్డి, శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం, అనంతపురం.

8. శ్రీ రంగనాథ రామచంద్ర రావు, ఆదోని, కర్నూలు జిల్లా.

9. కుమారి తుమ్మపూడి భారతి, శ్రీపద్మావతి మహిళా విశ్వవిద్యాలయం, తిరుపతి.

10. డా॥కె. షణ్ముగం పిళ్లై, పొన్నేరి, తమిళనాడు.

11. శ్రీ ఆకెళ్ళ సుబ్రహ్మణ్యం, బెంగుళూరు.

12. శ్రీ జి. శివరాం, బెంగుళూరు.

13. ఆచార్య ఫణీంద్ర, సికిందరాబాదు.

14. డా॥ బి. మహాలక్ష్మి కుమారి, బెంగుళూరు.

15. శ్రీ జి. వి. సుబ్బారావు, హైదరాబాదు.

16. శ్రీ కోడూరి విజయ కుమార్, హైదరాబాదు.

17. శ్రీ త్యాగ దుర్గం మునస్వామి, తిరుపతి.

18. శ్రీ న్యాయవతి శ్రీనివాసరావు, (వాసు), బెంగుళూరు.

19. డా॥ ఎన్. మునిరత్నమ్మ, శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి.

20. డా॥ రాజేశ్వరి, శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి.

21. శ్రీ డి.కేశవరావు, హిందూపురం, అనంతపురం జిల్లా.

22. శ్రీ దీవి సుబ్బారావు, డైరెక్టర్, తెలుగు అకాడమి, హైదరాబాదు.

23. శ్రీ డి. సుధాకర్, కాకినాడ, తూర్పు గోదావరి జిల్లా.

24. శ్రీ 'వెంపో', శ్రీరామ కోటయ్య కుటీరం, మొఖాసా కలవ పూడి, మండవల్లి మండలం, కృష్ణాజిల్లా.

25. డా॥ ఎ.బి. సాయిప్రసాద్, చెన్నై.

26. డా॥ మానికొండ విజయలక్ష్మి, చెన్నై.

27. ఆచార్య డి. చిన్ని కృష్ణయ్య, చెన్నై.

28. శ్రీ ఎం.ఎస్. అనంత రామన్, బెంగుళూరు.

29. ఆచార్య హెచ్.ఎస్. బ్రహ్మానంద, శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం, అనంతపురం.

30. శ్రీ ఏలేశ్వరం మాధవాచార్యులు, ఉట్నూరు, అదిలాబాద్ జిల్లా.

31. శ్రీ అనిపెద్ది జగన్నాథ శాస్త్రి, కె. అర్. పురం, కన్నాపురం, (వయా) కొయ్యల గూడెం, పశ్చిమ గోదావరి జిల్లా.

32. డా॥ పి. చెన్నారెడ్డి, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, శ్రీశైలం, కర్నూలు జిల్లా.

33. ఆచార్య పి. యశోదారెడ్డి, హైదరాబాదు.

34. శ్రీ ఏల్చూరి మురళీధరరావు, శ్రీవేంకటేశ్వర కళాశాల, న్యూఢిల్లీ.

35. శ్రీ పెన్మెత్స సత్యనారాయణ రాజు ('రాజు'), కూకట్ పల్లి, హైదరాబాదు 500 072.

36. శ్రీ కె. వి. హనుమంతరావు, దూరదర్శన్ కేంద్ర, ఇంఫాల్ 795 010, మణిపూర్ స్టేట్.

37. డా॥ కె. నగజా కుమారి, యద్దనపూడి, (వయా) చిలకలూరి పేట, ప్రకాశం జిల్లా.

38. డా॥ వి. వి. బి. రామారావు, న్యూఢిల్లీ.

39. శ్రీ ఎ. ఎన్. ఎస్. సత్యనారాయణ, తణుకు, పశ్చిమ గోదావరి జిల్లా.

40. కవిశ్రీ మోహన్‌ప్రసాద్, 32-4, తణుకు 534 211, పశ్చిమగోదావరి జిల్లా.

41. శ్రీ నెమ్మలూరి సత్య నారాయణ మూర్తి, రిటైర్డ్ హెడ్ మాస్టర్, టీచర్స్ కాలనీ, తాడేపల్లి గూడెం, పశ్చిమ గోదావరి జిల్లా.

42. డా॥ కె. రంగారావు, పాలవంచ, ఖమ్మం జిల్లా.

43. శ్రీ బత్తుల వీ. వెం. అప్పారావు, సోమాజిగూడ, హైదరాబాదు - 82

44. డా॥ తటవర్తి రాజగోపబాలం, డి. ఎన్. ఆర్. కళాశాల, భీమవరం.



శ్రీ బులుసు వేంకటేశ్వర్లు

చిట్టివలస

విశాఖ జిల్లా

# చైతన్య కవిత

బహుధాన్య వసంతం - గ్రీష్మం - వర్షం

**APRIL - SEPTEMBER 1998**



చైతన్య కవితా వేదిక. బెంగుళూరు